# ఆంధ్రపత్రిక

317JB



The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 11 MONDAY 11th APRIL 1949 వెల ఒకఅణా { Founder: K. Nageswara Rao

# యుద్ధ మనివార్యమని రక్షణశాఖలకు అత్యధికధనం వినియోగం

## పాకిస్థాన్ అసత్య ప్రచారం

పాకిస్థాన్ అబద్ధ ప్రచారమునకు ఉదాహరణ చూపుచు సర్వసేనాని జనరల్ కరియప్ప శనివారం శ్రీనగరులో ఉపన్యసిస్తు యిట్లనెను:

"హెంగరువద్ద భారత సైనికులు ఒక ముస్లిమ్ కాన్స్టెబుల్ వర్కరును యెట్లు వధించిరో కొంతకాలము క్రిందట పాకిస్థాను సేనకు చెందిన ఒక బ్రిగేడియరు ఐక్యరాజ్య సమితి పర్యవేక్షకులు చిత్రముగా వర్ణించి చెప్పిరి. ఈ ఉదంతము విషయమై దర్యాప్తు చేయుటకు ఐక్యరాజ్య సమితి పర్యవేక్షకులు వధజరిగిన స్థలమునకు వెళ్లినప్పుడు వారికొక గోరీ చూపబడెను. ఆ గోరిని త్రవ్వగా అందులో ఒక కుక్క శవము కనబడెను."

## అమెరికా సైనిక బడ్జెట్: వైమానికశాఖకు హెచ్చు మొత్తం

## 1950 జూన్ 30 లోగా సంగ్రామం రాకపోవచ్చుని బ్రాడ్లీ నమ్మకం

వాషింగ్టన్, ఏప్రిలు 9: యుద్ధానంతరం ఎప్పుడూ కనివిని ఎరుగనంతటి పెద్దమిలిటరీ బడ్జెటును అమెరికన్ ప్రజాశాసనసభ వారి కేటాయింపు సంఘం నేడామోదించెను. ఈ బడ్జెట్ సంఖ్య 1590 కోట్ల, 91 లక్షల, 16 వేల 800 డాలర్లు. అధ్యక్షుడు ట్రూమన్ మొదట కోరిన దానికంటె ఇది 50 కోట్ల డాలర్లు ఎక్కువ. క్రిందటి ఏడాది బడ్జెట్ 1045,44,77,413 డాలర్లు.

ప్రస్తుతపు బడ్జెట్‌లో అత్యధిక భాగం విమాన శాఖది.

"మనకు ఆందోళన, త్యాగావసరము తప్ప నట్లున్నవి. రాజకీయా కాశంలో పొడమెడి దుశ్శకునములను చూస్తే ఈ బడ్జెట్ సంఖ్య ఇంతకు తక్కువగా ఉండుటకు వీలులేనట్లు తోచుచున్నది." అని బడ్జెట్‌ను రచించిన జార్జి మేహన్ ప్రకటించెను.

1950 జూన్ 30లోగా యుద్ధస్థితి అనవసరమని సైనిక ముఖ్యాధికారి జనరల్ ఒమర్ బ్రాడ్లీ కేటాయింపు సంఘమునకు హామీ ఇచ్చెను.

### సైనిక సంఖ్యలు

మొత్తము 47,43,100 మంది సైనికాధికారులు, సైనికులు అమెరికాకు ఉండవలెనని బడ్జెట్‌లో నిశ్చయింప బడినది. వీరిలో 16,44,300 మంది ప్రత్యక్ష సైనికులు, 27,09,300 మంది సుశిక్షిత సైనికులు, 3,99,500 మంది జాతీయ రక్షక సైనికులు ఉందురు.

ప్రత్యక్ష సైనికులలో భూతల పటాలములకు 6,77,000; నౌకాశాఖకు 5,27,800, విమానశాఖకు 4,40,000 మంది విభజింపడుదురు.

క్రొత్తరకం ఆయుధాలను కనిపెట్టుటకుగాను 58 కోట్ల డాలర్లు బడ్జెట్‌లో కేటాయింపబడెను.

1952 కు ముందు ఏ దౌర్జన్య కారునికి

(2-వ పేజి చూడుడు)

## శ్వేత ఆస్ట్రేలియా విధానానికి ఫిలిప్పైన్సు ప్రభుత్వ ప్రతిక్రియ

## తమ దేశీయుల బహిష్కరించు దేశాల వారలకు తమ దీవుల్లో స్థానంలేదని హెచ్చరిక

మనిల్లా, ఏప్రిల్ 9: ఫిలిప్పైన్సు ప్రభుత్వం ఒక నూతన శాసనాన్ని అమలు జరపటానికి ప్రయత్నించుతోంది. ఫిలిప్పైనువాసులు ఆవాసంగా వుండటానికి, వీల్లేకుండా యే యే దేశాలలో ఆంక్షలున్నాయో, ఆయాదేశాల వారెవ్వరూ ఫిలిప్పైన్సులో తాత్కాలికంగా కాని, శాశ్వతంగా కాని ఆవాసాలేర్పరచుకోకుండా నిరోధించటం. ఈ శాసనంయొక్క ఉద్దేశం.

ఈ బిల్లు దిగువశాసనసభలో రెండవ తూరి ప్రతిపాదనకు రాగానే ఇక్కడవున్న ఆస్ట్రేలియన్ వర్గాలలో చాలా ఆందోళన బయలుదేరింది. వీరంతా సలహా సంపత్తులకోసం, ఆస్ట్రేలియా, బ్రిటిష్ రాయబార వర్గాలచుట్టూ సలహా సంపత్తుల కోసం మూగుతున్నారు.

దిగువ శాసనసభలో ఈ బిల్లు ఎట్టిచర్చలూ లేకుండా, ఏకగ్రీవంగా ఆమోదించబడ్డది. సెనేట్‌లో కూడా ఇదే ఉత్సాహంతో ఆమోదించ బడుతుందని అంతా అనుకుంటున్నారు. ఎంతో కాలయాపన కూడా జరుగదట. ఈ బిల్లు శాసనంగా ప్రభవించితే ఇక్కడ నుంచి 60 మంది ఆస్ట్రేలియనులు దేశం విడిచి వెళ్లి పోవలసివస్తుంది.

వీరిలో 30 మంది అమెరికా వ్యాపారస్తులనూ, ఇతరులనూ వివాహం చేసుకున్న ఇల్లాండ్రు. వీరు ఆస్ట్రేలియా జన్మస్థానంగా కలవారు. వాళ్ల భర్తలందరూ వ్యాపారాలన్నా వొదులుకోవాలి, లేదా సంసారాలన్నా విచ్ఛేదం చేసుకోవాలి.

ఆస్ట్రేలియా ప్రభుత్వం, అక్కడున్న ఫిలిప్పైనులను, ఎంతోకాలంగా ఆవాసంగా వుంటున్న వారినందర్నీ బయటికి వెళ్లగొట్టి వెయ్యటానికి, తీవ్రతరమైన శాసనాలు ప్రవేశపెడుతున్న కారణంగా, దిగువశాసనసభలో ఈ బిల్లుమీద వచ్చిన సవరణలన్నీ బిల్లును మరింత తీవ్రతరం చేసేవిగా వున్నాయి గాని, సడలించేవిగా లేవు.

"ఈ బిల్లు శాసనం కావటంతోనే, బయలుదేరి పోటానికి, ఆస్ట్రేలియనులంతా మూటాముల్లే కట్టుకొని సిద్ధంగా వుండవచ్చు." అని ఎటేయిన్జా అన్నారు.

"ఫిలిప్పైన్సు అమెరికన్ సైనిక సార్జెంటు లారెన్సో గ్యాంబో భార్య జన్మతః ఆస్ట్రేలియన్ అయినా, ఆమె దేశంలోకి రాకటానికి ఈ శాసనం ప్రతిబంధకం కాదు. అటువంటి విషయం ప్రత్యేక నిబంధనలు అమలు జరగవచ్చు అని ఎటేయిన్జా అన్నారు.

## వివిధ రాష్ట్రాలలో రోజువారీ ఆహారం

పాట్నా, ఏప్రిల్ 9: 1947-48 సం॥లో ఒక్కొక్క రాష్ట్రములోని ఒక్కొక్క వయోజనునికి దినమునకు ఎన్ని ఔన్సుల ఆహారధాన్యము లభ్యమైనదీ ఆహారశాఖా మంత్రి జైరాందాసు దౌలత్రాం నేడిచ్చట రాష్ట్రీయ సహకార సంఘ సమావేశములో ఇట్లు వివరించెను.

| | |
|---|---|
| సి. పి. బీరారు | 18.2 |
| ఒరిస్సా | 15.1 |
| పశ్చిమ బెంగాల్ | 14.4 |
| యు. పి. | 13.5 |
| బొంబాయి | 12.8 |
| తూర్పు పంజాబు | 11.3 |
| మద్రాసు | 11 |
| బీహారు | 9.9 |

## బలీయమగు సైన్యమును నిర్మింప భారత సర్వసేనాని కృతనిశ్చయము

శ్రీనగర్, ఏప్రిల్ 9: బలీయమగు భారత సేనను నిర్మించు కృతనిశ్చయమును భారత సర్వసేనాపతి జనరల్ కె. ఎమ్. కరియప్పగారు నిన్న యిచ్చట వెలిబుచ్చిరి. 'ఆద్యంతము నేను భారతీయుడను. భారత దేశంపై ఎవ్వరు దుష్టకన్నువేయ సాహసింపజాలనంత బలీయమైన సంస్థగా నేను భారతసైన్యమును చేయ కృతనిశ్చయుడనై యున్నాను' అని యిచ్చట బహిరంగసభలో ఉపన్యసించుచు జనరల్ కరియప్ప చెప్పిరి.

### ఉత్తర నార్వే సేనాధిపతి

ఓస్లో, ఏప్రిల్ 8: తన నాటోదళ సైన్యాధిపతికి, ఉత్తర నార్వేలో సర్వ దళాధిపత్యమును, నార్వే నేడిచ్చెను. ఉత్తర నార్వే సరిహద్దు రష్యాతో కలిసియున్నది.

## డా॥ హొచిమిన్ ప్రతినిధులతో సంప్రతింపులు

### వచ్చేవారం ఇండోచైనాకు బావోదయ్ రాక

పారిస్, ఏప్రిల్ 9: అన్నాం మాజీ చక్రవర్తి బావోదయ్‌కి ముఖ్య స్వంత కార్యదర్శి ప్రిన్సు బుయ్యాలో వచ్చేవారం ఇండోచైనాకు వెళ్లినప్పుడు విప్లవ నాయకుడు హొచిమిన్‌యొక్క ప్రతినిధులను కలిసికొని సంభాషించునని అతని సన్నిహితులు నేడు చెప్పినారు.

వచ్చేవారం బావోదయ్‌కూడ ఇండోచైనాకు వచ్చునట.

ప్రిన్సుబుయ్యాలో సైగన్, హనోయ్, పూర్వపు రాజధాని హ్యూ, మున్నగు ప్రదేశములలో సంచరించి వివిధ వర్గాల అభిప్రాయములను తెలిసికొని బావోదయ్ ఆగమనానికి మార్గం సుగమం చేయుటకు ప్రయత్నించునట.

## గాంధినిధి వసూలుకు ఆంధ్రలో రాజెన్ బాబు పర్యటన

గాంధి స్మారకనిధి అధ్యక్షుడు డాక్టర్ రాజేంద్రప్రసాద్ గారు గాంధి నిధిని వసూలుచేస్ నిమిత్తం ఈనెల 26 నుండి 29 వరకూ రాష్ట్రంలో పర్యటించెదరని ఆంధ్రకాంగ్రెస్ కార్యదర్శి శ్రీ కంముల ఓబులరెడ్డి గారు ప్రకటిస్తున్నారు. ఈ పర్యటన నాల్గురోజుల్లో అధమం 10 లక్షల రూపాయిలైనా వసూలు కావాలని హెచ్చరిస్తూ ధనికులు, పారిశ్రామికులు, రైతులు వ్యాపారస్థులు యావన్మందీ అవిరళంగా తాము నిరాడంబరంగా ఇరుగుల నుండి వసూలుచేసి రాజేన్‌బాబుకు సమర్పించాలని విజ్ఞప్తిచేస్తున్నారు. రాజేన్‌బాబు పర్యటన కార్యక్రమం ప్రస్తుతం ఇలా నిర్ణయమైంది. ఏప్రిల్ 26: కడప, ప్రొద్దుటూరు, నంద్యాల, ఏప్రిల్ 27: గుంటూరు, తెనాలి, విజయవాడ; ఏప్రిల్ 28: గుడివాడ, ఏలూరు, రాజమహేంద్రవరం, ఏప్రిల్ 29: అనకాపల్లి, భీమిలిపట్నం, విజయనగరం, విశాఖపట్నం.—

## ఆయుర్వేదమును మించినశాస్త్రము లేదు

### అ. భా. ఆయుర్వేద సమావేశం అధ్యక్షుడు మజుందార్ ఉద్ఘాటన

బరోడా, ఏప్రిల్ 10: ఆయుర్వేదమును సరియైన మార్గంలో అభివృద్ధి పరచినచో ప్రపంచదృష్టిలో ఇండియా గౌరవము సార్జించి పూర్వపు ఔన్నత్యము నందుకోగలదని నేడిచ్చట అఖిలభారత ఆయుర్వేద సమావేశమున కధ్యక్షత వహించిన కవిరాట్ హరిరంజన్ మజుందార్ ఉద్ఘాటించెను. ఆయన తన ఉపన్యాసంలో ఇంకా ఇట్లు చెప్పిరి.

"సర్వజనాంగీకృతమైన పద్ధతులపైనే ఆయుర్వేద మాధారపడి యున్నది. ఈ సంపద మనకు ప్రాచీన ఋషుల నుండి సంక్రమించినది. శాస్త్రముగా దానిఘనతకు ఎదురులేదు. ప్రభుత్వము నియమించిన కమిటీలన్నియు దాని విలువను గుర్తించినవి.

ఆయుర్వేదము భారతీయ నాగరికతలో నొక ముఖ్యాంగము. పరాయి పరిపాలనలో భారతీయులు పాశ్చాత్య వైద్య నైపుణ్యము నెట్లలవరచుకొనిరో, అట్లే ఇప్పుడు ఆయుర్వేద నైపుణ్యమునకు శక్తినంతయు ధారవోయవలెను.

భారత ప్రభుత్వము ఆయుర్వేదమున్నచో సవతితల్లి ప్రేమను చూపుచున్నది. పాశ్చాత్య ఔషధముల నిమిత్తము విదేశములలో కోట్లకొలది ధనమును వెచ్చించుచున్నది.

ప్రభుత్వము ఆయుర్వేద విశ్వవిద్యాలయములను, పరిశోధనశాలలను, ఫార్మసీలను, ఆస్పత్రులను, గ్రంథాలయములను, మ్యూజియములను, దీర్ఘచికిత్సానిలయములను స్థాపింపవలెను. కొన్ని సంవత్సరముల పాటు ఆయుర్వేదమునకిట్టి ప్రోత్సాహము లభించినచే గాని చోప్రా కమిటీవారు సూచించిన సర్వవైద్య విధానము సమన్వయము సిద్ధించదు.

చోప్రాకమిటీ ఆయుర్వేద మండలి అసలు అంశమును గ్రహింపనే లేదు. అయినను ఆకమిటీ నివేదిక మిగతా కమిటీల నివేదికల కన్నను మెరుగుగానే యున్నది. స్వదేశీవైద్య విధానమును ప్రాక్టీసు చేయువారికి పాశ్చాత్య విధానమును ప్రాక్టీసు చేయువారికి భేదమేమి చూపరాదని చోప్రాకమిటీ సూచించినది. ఉభయులను రిజిస్టరుచేయవలెనని, పరీక్షలలో ఉత్తీర్ణులైన వారికి, స్వతంత్రముగా అభ్యసించిన వారికి భేదా చూపించ రాదని కూడ కమిటీ సూచించినది.

అన్ని రాష్ట్రములలోను ఒకే విధముగ రిజిస్ట్రేషను పనులు చేయుట అత్యావసరము.

కాని, స్వదేశీ వైద్య బోధనాలయములలో కొన్నిటి బడినవిద్యార్థులకు ఫీజును, కొమి

(2-వ పేజీ చూడుడు)

## ద. ఆసియా యందలి అమెరికన్ ప్రతినిధుల సభ సమాప్తము

న్యూఢిల్లీ, ఏప్రిల్ 9: ద. ఆసియా యందలి వివిధ దేశములలోని అమెరికన్ రాయబారవర్గ ప్రతినిధుల సభ నేడు సమాప్తమయ్యెను. ఈసభలో వాషింగ్టను నందలి వివిధ ప్రభుత్వశాఖల ప్రతినిధులు కూడ పాల్గొనిరి. భారతదేశమునందలి అమెరికన్ రాయబారి హెండర్సన్‌గారు అధ్యక్షతవహించుచు ఈసభ కేవలము సమాలోచకసంస్థయని, విధాన నిర్ణయ సంస్థ కాదని నొక్కి చెప్పిరి. దక్షిణ ఆసియాలో వివిధరాయబారవర్గములకు సంబంధించిన సమస్యలను, ఆర్థిక, వైజ్ఞానిక, పరిపాలనా సంబంధములగు విషయములను చర్చించుటకు ఈసభ సమావేశపరుపబడెను.

## కరెన్ షరతులకు ప్రభుత్వం సమ్మతింపనందున సంధిచర్చల భగ్నం

## దేశం కోలుకోవాలంటే ఏదోవిధంగా యుద్ధవిరమణ జరగాలని బర్మా రాజకీయ వర్గాలసూచన

రంగూన్, ఏప్రియల్ 9: కరెన్ తిరుగుబాటుదారులకూ, బర్మా ప్రభుత్వానికీ, ఇన్‌సీన్‌లో జరుగుతున్న సంధి సంప్రదింపులు భగ్నమైపోయినట్టు బర్మా ప్రభుత్వ అధికార ప్రకటన వెలువడ్డది. కరెన్ ప్రతినిధుల ప్రతిపాదనలకు ప్రభుత్వం అంగీకరించ లేకపోయిందని ఆ ప్రకటనలో తెలియజేశారు.

దేశ వ్యాపితంగా అన్ని యుద్ధరంగాలలోనూ, యుద్ధవిరమణ జరగాలనీ, ఆయా ప్రాంతాలలోని సైనిక, రాజకీయ నాయకులంతో సంప్రదింపులను చర్చించటానికి అవకాశముండాలనీ కరెన్ ప్రతినిధులు కోరారు.

సంధి సంప్రతింపుల కాలంలో, ప్రభుత్వసేనలేవీ, తాను ఆక్రమించిన ప్రాంతాలలోకి అడుగు పెట్టరాదనీ, ఇతర అల్ప సంఖ్యాకవర్గాలకు చెందిన, చిన్, కాచిన్, షాన్, అందమాన్సు ప్రజావర్గాల నాయకులందరికీ ఈ సంధి సంప్రదింపులలో పాల్గొనే అవకాశముండాలనీ, కరనులు పట్టుబట్టినారు.

"ఈ ప్రతిపాదనలకు బర్మా ప్రభుత్వం అంగీకరించలేకపోయింది. ఈ ప్రతిపాదనలు, కడచిన మంగళవారంనాడు, ప్రభుత్వానికీ, కరెన్ జాతీయసంయుక్త మహాసభాధ్యక్షుడు సా, బా, యు. ల్వే కి జరిగిన ఒడంబడిక అవధులను అతిక్రమించి వున్నయ్" అని ప్రభుత్వం ప్రకటించింది.

మంగళవారంనాడు జరిగిన ఒడంబడికలో ప్రభుత్వం, కేరనులు తమ గ్రామాలను రక్షించుకోటానికి కావలసిన మట్టుకైన ఆయుధబలాన్ని మాత్రమే ఉంచుకోటానికి అంగీకరించింది.

క్షమాదాన విషయంలో, కేరనులకూ, ఇతర అల్పసంఖ్యాకవర్గాలకూ, కేరనులకూ, విప్లవంలో పాల్గొన్న యితర బర్మీయులకూమధ్య ఎట్టి వ్యత్యాసమూ చూపడ

(2-వ పేజీ చూడుడు)

## నవ్యచైనా నిర్మాణంలోతోడ్పడుడను అధ్యక్షునివిజ్ఞప్తికికమ్యూనిస్టుజవాబు

### యాంగ్ట్సీనదిపై యాధిపత్యానికి తీవ్రయుద్ధం

నాన్‌కింగ్, ఏప్రిల్ 9: యాంట్సీనది దక్షిణతీరమున వడిన కమ్యూనిస్టుల మొదటి ఫిరంగిగుండ్లు నాంకింగ్ - షాంఘైరైలుపై నాంకింగుకు 20 మైళ్లదూరమున నున్న లంగ్టాన్ రైల్వేస్టేషనుకు తగిలెను. ఈ గుండ్లు విశాలమైన నదినిదాటివచ్చి 2 ప్రాణములు తీసెను. నల్గురు గాయపడిరి. స్టేషను కొంతవరకు ధ్వంసమయ్యెను. 36 గంటలకు పూర్వము కమ్యూనిస్టులు వశపరుచుకొన్న ఈ చెంగ్ వైపునుండి ఈ గుండ్లు వచ్చెను. నాంకింగ్ పశ్చిమమున 15 మైళ్లదూర సంఘమున నున్న క్యాంగ్‌పూవద్ద కమ్యూనిస్టులకును ప్రభుత్వసేనలకునుర్షణ జరిగెనని, కమ్యూనిస్టులు తిరుగుగొట్టబడిరని ప్రభుత్వసైనిక వార్తాహార సంఘము తెలిపెను.

కమ్యూనిస్టుల వత్తిడివల్ల ప్రభుత్వ సైనికులు హాంకోకు 120 మైళ్లు మార్పు వనున్న హ్వాంగ్ మెయి అను ప్రదేశమును, హూప్యే రాష్ట్రమునందలి వాచియాచీ అను ప్రదేశమును ఖాళీ చేసిరని ఈవార్తాహార సంఘము తెలిపెను.

### నాంకింగులో ప్రభుత్వ నాయకుల సమాలోచనలు

యాంట్సీ నదిని దాటి ప్రభుత్వము వారి చేతులలో నున్న భూభాగములోనికి ప్రవేశింప కమ్యూనిస్టులు సిద్ధముగా నున్నారు. యాంట్సీ నది ఉత్తర తీరమున వేయి మయిళ్ళ రంగములో నున్న తక్కిన ప్రభుత్వ స్థావరములను కమ్యూనిస్టులు తుడిచివేయుచుండిరి.

నాన్‌కింగులో ఆక్టింగ్ అధ్యక్షుడు లీట్సుంగ్‌జన్ ప్రభుత్వనాయకులసభ నొకదానిని సమావేశపరచెను. నదీరక్షణలను బలపరుచుటకు జరూరుచర్యలను నిర్ణయించుటకై ఆయన ఈ సభను సమావేశపరిచెనని విశ్వసనీయమైన వర్గములవారు చెప్పుచున్నారు. కమ్యూనిస్టులు యాంట్సీనదిని దాటు అవకాశముండుటచేత భయవిహ్వలులగు నాన్‌కింగుప్రజలు వెండిడాలర్లు విదేశీయ చలామణి నాణెములు కొనుటకు ఎగబడిరి. ఇప్పుడు ఈ నగరము యొక్క జనాభా యిదివరకుకంటె చాలా తగ్గినది. ఇప్పుడు నగరములో నివసించువారు 7,50,000 మాత్రమే. ప్రభుత్వము వారి బంగారు యువాన్ చలామణి నాణెముల విలువ కొలది గంటలలో 100 కి 150 వంతులకంటె గూడ ఎక్కువగా తగ్గినది.

## బి. బి. సి. వార్తా ప్రసారం అపుదల

న్యూఢిల్లీ, ఏప్రిల్ 9: అ. భా. రేడియో వారు రాత్రి 9-30 కు గావించుచున్న బి. బి. సి. వార్తా ప్రసారము ఈ ఏప్రిల్ 16 నుండి ఆపు చేయబడునని అ. భా. రేడియోవారి ప్రకటన తెలుపుచున్నది. 'ఐనప్పటికీ, రాత్రి 9 గంటలకు ఆంగ్ల భాషలోను, రాత్రి 9-15 కు హిందూస్థానీలోను గావింపబడుచున్న వార్తా ప్రసారములలో రేడియో శ్రోతలకు ప్రపంచ వార్తలు లభ్యమగును' అని ప్రకటన తెలుపుచున్నది.

నానకింగుకు 30 మైళ్ల దూరమున కమ్యూనిస్టులు యాంట్సీ ఉత్తరతీరమున తాము స్థాపించిన శతఘ్నుల సహాయముతో షాంఘై-నానకింగులమధ్య నదీ రవాణానుయావత్తును ఆపుచేసిరి. ఆసమయమునసే నాన్‌కింగును రక్షించుచున్న ప్రభుత్వ సైనికులు చురుకుదనము కలుగ జేయుటకుగాను నగరమునందలి ఖాళీస్థలములలో కవాతులు చేయుచుండిరి. నాన్‌కింగ్-షాంఘైలకుమధ్య నదిమధ్యలో ఒక ప్రభుత్వ నౌకపై గుండ్లుపడగా యిద్దరు నావికులు మరణించుట లేక గాయపడుట తటస్థించెను.

చింకియాంగ్‌కు ఎదురుగా కమ్యూనిస్టులు ఒక ముఖ్య స్థావరమును పట్టుకొని, మరియొక దానివద్దకు వచ్చిరి. చింకియాంగ్ పై ఎప్పుడుబట్టిన నప్పుడు కమ్యూనిస్టులు కాల్పులు ప్రారంభించ వచ్చునని అనుకొనుచున్నారు. నది ఉత్తర తీరమున సురక్షితముగా నున్న ప్రభుత్వ స్థావరము ప్యూకౌ మాత్రమే. ప్రజలకు లొంగిపోకలసినదని ఈ. చైనా కమ్యూనిస్టు రేడియో నేడు మరల ప్రభుత్వమువారిని హెచ్చరించెను. ప్రభుత్వమువారు గావించిన విజ్ఞప్తికి కమ్యూనిస్టు నాయకుడు చిమ్చ జబాబు రాత్రిపూట బ్రాడ్ కాస్టు చేయబడునని రేడియో తెలిపెను. నూతన చైనాను నిర్మించుటలో తోడ్పడవలెనని నిన్న చైనా ఆక్టింగ్ అధ్యక్షుడు కమ్యూనిస్టులకు విజ్ఞప్తి గావించియుండెను.

### 'కమ్యూనిస్టులు దాక్షిణ్యము చూపెదరు'

సంధి రాయబారములు జరుపుటలో కమ్యూనిస్టు పార్టీ వారు 'దాక్షిణ్యము చూపు విధానమును' అవలంబింప సిద్ధముగా నుండిరని కమ్యూనిస్టు నాయకుడు మావోట్సేటుంగ్ చైనా ఆక్టింగ్ అధ్యక్షుడు జనరల్ లీట్సుంగ్ నిన్న గావించిన విజ్ఞప్తికి

[2-వ పేజీ చూడుడు]

## ఇటాలియన్ వలసల భవిష్యత్తు

### బ్రిటన్, అమెరికా ప్రతిపాదనలకు రష్యా వైముఖ్యం

లేక్‌సక్సెస్, ఏప్రిల్ 9: ఆఫ్రికాలోని పూర్వపు ఇటాలియన్ వలసల భవిష్యత్పరిపాలనపై బ్రిటన్, అమెరికాలు చేసిన ప్రతిపాదనలను రష్యా నేడు తిరస్కరించెను.

ఈ వలసలపై సమితి రాజకీయ సంఘంలో నేడు జరిగిన చర్చలలో ప్రథమ వక్తగా మాట్లాడుచు బ్రిటన్, అమెరికాలు సూచించిన పరిష్కార మార్గములు అంగీకార యోగ్యములు కావని రష్యన్ ప్రతినిధి ఆంద్రీ గ్రోమికో నిరసించెను.

ఇటాలియన్ వలసల విషయమై ఇటలీతో చేసుకున్న సంధిని అమెరికా, బ్రిటన్లు పూర్తిగా ఉల్లంఘించినవనీ, ఆవలసలలోని ప్రజలకోరికలను నిర్లక్ష్యం చేసినవనీకూడ అతడనెను.

"ఇటాలియన్ వలసల నెవరు, ఏ సరతులననుసరించి పరిపాలింప వలెనో నిర్ణయింపవలసినది ఐక్యరాజ్యజనరల్ ఎసెంబ్లీ. ఈ రీతిగా ఒక రాజ్యమునకు చెందిన ప్రదేశములను మరొక రాజ్యమునకు, లేక రాజ్యముల కూటమికి ఇష్టం వచ్చినట్లు అప్పగించి వేయుటను ఎవ్వరూ అంగీకరింపరు. ఆ ప్రదేశములు తమ పరిపాలన క్రిందకు రావలెనని కోరే రాజ్యాలు స్వార్థము నపేక్షించుచున్నవి కాని సమితి ప్రయోజనములను కాదు.

పూర్వపు ఇటాలియన్ వలసలను ఒక్కొరి ధర్మకర్తృత్వంక్రిందకాక ఐక్యరాజ్య ధర్మకర్తృత్వం క్రింద కొన్ని రాజ్యములకు అప్పగింపవలెను. వానిలో ఇటలీ ఒకటియై యుండవలెను." అని గ్రోమికో సూచించెను.

బ్రిటిషు పరిపాలన క్రింద కొన్ని వలసలు పూర్తిగా చెడిపోయినవని గ్రోమికో ఆరోపించెను.

ఉదాహరణకు, ఇటాలియన్ సోమాలీలాండునుండి కొన్ని ఫ్యాక్టరీలను ఊడదీసి కొంత సామగ్రిని బ్రిటను ఎత్తుకొని పోయినదనీ, దీనినంతను చూడగా ఈ ప్రదేశాలను బ్రిటన్ అమెరికాలు తమ మిలిటరీ స్థావరాలుగా ఉపయోగించ నెంచుచున్నవని తేలుచున్నదనీ, గ్రోమికో నిస్సంకోచంగా ఆరోపించెను.

"ఈ స్థావరములను వారు తమ దౌర్జన్య క్రీడకై ఉపయోగించుకొనదలచుచున్నారు. వారు దౌర్జన్య క్రీడాసక్తులై ఉన్నారనుటకు, నూత్న ప్రజారాజ్యములకు వ్యతిరేకంగా వారిచేవల స్థాపించిన మిలిటరీ రాజకీయ కూటములే నిదర్శనము." అని కూడ రష్యన్ ప్రతినిధి అన్నాడు.

ఈ దురారోపణలకు సబబైన ఆధారము లేదనీ, తమ సదుద్దేశములకు అపార్థము కల్పించుట తగదనీ, పరస్పర దుష్ప్రచారంలో తమకు ఆసక్తి లేకపోయినా, అవసరమైతే తాము అందుకు సిద్ధపడగలమనీ బ్రిటిష్ ప్రతినిధి హెక్టర్ మెక్నీల్ సమాధానము చెప్పెను.

అంతట సభ సోమవారమునకు వాయిదాపడెను.

## భారతపారిశ్రామిక వస్తు ఉత్పత్తిలో పెరుగుదల

### పరిస్థితి ఇట్లేఉంటే ఉత్పత్తి ఉన్నత శిఖరాలనందుకోగల అవకాశం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 10: దేశవ్యాప్త సమ్మెల బెదిరింపులను అన్నింటినీ సురక్షితంగా అధిగమించి భారతదేశం నూతన సంవత్సరకార్యక్రమాన్ని ఎక్కువ ధైర్య, స్థయిర్యాలతో ప్రారంభించినది. యుద్ధానికి పూర్వపు ఉత్పత్తి ప్రమాణం కంటే నూటికి 15 వంతులు ఎక్కువ ఉత్పత్తి గత సంవత్సరంలో జరిగినట్లు అంచనా వేసినారు.

భారతదేశంలోని వివిధ ప్రాంతాల కార్మిక, పారిశ్రామిక స్థితిగతులను పరిశీలించగా 1948 వ సంవత్సరములో పారిశ్రామిక తగువులు, కార్మిక సమ్మెలు, అంతఃపూర్వం కంటే తక్కువగా ఉన్నట్లు కన్పిస్తున్నది. అంతేగాక పనిచేసిన రోజులసంఖ్యలో ఎన్నతగిన అభివృద్ధి కూడా కన్పించింది. ముందు కూడా పనివారికీ, యజమానులకూ ఇప్పుడున్న సామరస్యం, సత్సంబంధాలు ఉంటే, 1949 సంవత్సరంలో పారిశ్రామిక ఉత్పత్తి నూతన శిఖరాలను అందుకో గలదు.

1947 ఆఖరుదశలో దాదాపు ప్రతి పరిశ్రమలోని పనివారూ, అనుక్షణం "ఇదిగో సమ్మెచేస్తాం, అదిగో సమ్మె చేస్తున్నాం" అని బెదిరించుతూ వచ్చారు. కాని భారతీయనాయకులు ధైర్యంతో, రాజకీయ చాతుర్యాన్ని ప్రదర్శించి ఆ ప్రమాదాన్ని విజయవంతంగా ఎదుర్కొన్నారు. ప్రభుత్వం, పారిశ్రామికులు, కార్మికులూ చేరి "పారిశ్రామిక సంధి" ఒడంబడికను కుదుర్చుకొని ఆ సంధి ఒడంబడికను అమలుజరపడానికి ప్రయత్నించారు. భారతప్రభుత్వం కేంద్ర కార్మిక సలహాసంఘాన్ని నియమించింది. పెట్టుబడికి న్యాయమైన ప్రతిఫలం, కార్మికులకు పనికితగిన వేతనం, పనివారికీ, యజమానులకూ సఖ్యత పెంపొందించడం మొదలైన విషయాలననుసరించి ఈ కార్మిక సలహాసంఘం శ్రద్ధవహించి పనిచేస్తూ ఉంది.

పంచమందికిపైగా పనివారున్న ప్రతి పారిశ్రామిక సంస్థలో నూ "పనిపాటల సంఘాలను" ప్రభుత్వం నెలకొల్పింది. కార్మికావాసముల విషయంలో పనివారు ఎక్కువ పట్టుదలతో ఉన్నారు. దేశం అంతట్నీ ఒకభాగంగా పరిగణించి పనివాళ్ళకు ఇళ్లుకట్టేందుకు కేంద్రప్రభుత్వం ఒక సమగ్రపథకాన్ని తయారుచేసింది. పారిశ్రామికంగా చాలా అభివృద్ధి చెందిన బొంబాయిరాష్ట్రానికి ఈ గృహనిర్మాణ కార్యక్రమాన్ని కొనసాగించే నిమిత్తం భారతప్రభుత్వం 2 కోట్ల రూపాయలను అప్పుగా ఇచ్చింది. ఈ పని ప్రారంభమైంది. పని చురుగ్గా సాగుతూఉంది. బొగ్గుగనుల్లో పనిచేసే కార్మికులకు ఇళ్లుకట్టించే నిమిత్తం కేంద్రప్రభుత్వం వేరే ఒక గృహనిర్మాణసంఘాన్ని స్థాపించింది.

ఇవిగాక కార్మిక సౌకర్యముల వృద్ధి చేయడానికి కేంద్రప్రభుత్వం అనేక శాసనాలను చేసింది. దాదాపు 20 లక్షల పనివారికి వర్తించే ప్రభుత్వ భీమాపద్ధతిని 1948-వ సంవత్సరంలో ప్రారంభించింది. ఫ్యాక్టరీల చట్టాన్ని నేటి అవసరాలకు పరిస్థితులకు తగ్గట్టుగా సవరించడం జరిగింది. ఈ సంవత్సరారంభంలో పార్లమెంట్ ఆమోదించిన 'న్యాయవేతనాల' శాసనాన్ని ఆచరణలో పెట్టడానికి అవసరమైన చర్యలు తీసుకోవడంకూడా జరిగింది.

ఇవిగాక మరొక మూడు కొత్తశాసనాలను చేయడానిన్ని గురించికూడా ప్రభుత్వం ఆలోచించుతూ ఉన్నది. ఒకటి కార్మికసంబంధములబిల్లు. సమ్మెను ప్రకటించడానికి, ప్రారంభించ డానికి ముందు, రాయబారాలు నెరపడం, సమష్టిగా తమహక్కులకు బేరమాడడంవంటి చర్యలను ప్రోత్సహించేది. రెండవది భారత కార్మికసంఘముల చట్టసవరణ. మూడవది నేటి యంత్రాగార శాసనానికి అనుగుణంగా గనుల చట్టసవరణ. కార్మికుల స్థితిగతులను చక్కచేయడానికి భారత ప్రభుత్వం చేస్తున్న ప్రయత్నాలకు ప్రత్యక్ష ప్రతిఫలం అప్పుడే కన్పిస్తూఉంది. సమ్మెలు చాలా సకృత్తైనవి. సమ్మెల్లో పాల్గొన్నవారి సంఖ్యకూడా తగ్గింది.

1947 లో పనివారు సమ్మెచేయడం గాని, యజమానులు సంస్థలను మూసివేయడంగాని 1811 సార్లు జరిగెను. 1948 లో 1684 సార్లు మాత్రమె జరిగింది. నష్టపడిన పనిరోజులుచూస్తే 1944 లో 16,362,665 రోజులైతే 1948 లో 8,037,532 రోజులు మాత్రమే.

## సామ్రాజ్యవాదుల తోకవెంట యుగోస్లావియా నడువదు

### మార్షల్ టిటో ప్రకటన

బెల్‌గ్రేడ్, ఏప్రియల్ 9: "సామ్రాజ్యవాదుల తోకబుచ్చుకుని యుగోస్లావియా నడవదు. ఆత్మశక్తిపైనా, ఆత్మవిశ్వాసంపైనా ఆధారపడే యుగోస్లావియా, అత్యంత విజయవంతంగా, బలవత్తరమైన ఒక సోషలిస్టు మహోద్యమము నిర్మించుచున్నది." అని యుగోస్లావ్ ప్రధాని మార్షల్ టిటో, నేడు ప్రసంగించాడు.

యుగోస్లావ్ ప్రజాసేన తృతీయ వార్షికోత్సవ సందర్భంలో ప్రసంగించుతూ ప్రధాని టిటో ఇలా తెలియజేశాడు: "ప్రస్తుతం ఈ దేశానికి ఉన్న పరిస్థితులనూ, మిగతా యూరోపు రాజ్యాలు మాపట్ల ప్రదర్శిస్తున్న దృక్పథాన్నీ ఆధారంగా తీసుకొని, మా తోకజంటలు మమ్మల్ని తిప్పకోగలమనిగాని, ఇక్కడే ఏ ఏర్పాట్లు సాగించవచ్చునని గాని, పెట్టుబడిదారీ దేశాలలోని ఏ అభివృద్ధి నిరోధకుల గాని, దుష్టాత్ములు గాని తలంచుచున్నట్లయితే, వారు చాలా ప్రమాదకరమైన భ్రమలో ఉన్నారని నేను చెప్పదలచుకున్నాను. ఈ విషయంలో మా విధానం ప్రారంభానికి ఇప్పటికి ఏ విధంగానూ భిన్నంగాదు", అన్నాడు. కామిన్‌ఫారం చేస్తున్న యుగోస్లావ్ వ్యతిరేక ప్రచారాన్ని సూచిస్తూ ఆయన ఇలా అన్నాడు.

"ఈ ప్రచారం ఎంత తీవ్రతరంగా సాగుతున్నకొద్దీ మా విప్లవాశయం మరింత బలపడుతున్నది. అచంచలమై నిలచి ప్రతిఘటించాలనే మా నిశ్చయం మరింత సుదృఢమౌతున్నది.

"ఇది ఏ విధంగానూ, మార్క్సిస్టు ప్రచారం కాదు; సోషలిస్టు దేశాలమధ్య వున్న సంబంధ బాంధవ్యాలను విచ్ఛిన్నం చేస్తూ, ఇది సోషలిస్టు మహాసిద్ధాంతాలకే అపఖ్యాతి తెచ్చేదిగా వుంది; అంతేగాదు. విశ్వాభ్యుదయ విప్లవాన్నే కూలదోసి వేసే విపరిణామాలకు ఇది దారితీస్తోంది." అన్నాడు.

### వీరశైవ కళాశాలకు ప్రభుత్వగ్రాంటు

మదరాసు, ఏప్రిల్ 9: బళ్లారి వీరశైవ కళాశాలకు మదరాసు ప్రభుత్వము భవన నిర్మాణము నిమిత్తం 1 లక్ష 75 వేల రూపాయలు గ్రాంటు మంజూరు చేసిరి.

భవనముల నిర్మాణమునకు ధనములేని కారణమున జులైనుంచి కళాశాలను మూసివేయుటకు పాలక వర్గమువారు నిశ్చయించిరి. ఈ కళాశాలనుంచి క్రిందటి ఆంగ్లేయనావేశము లో ప్రో.. విద్యార్థులు ఉత్తీర్ణులయిరి.

## స్టాలిన్ బహుమతులు

### వివిధ మారణాయుధ నిర్మాణ కౌశలమునకు ప్రత్యేక బహుమతులు

మాస్కో, ఏప్రిల్ 9: మొత్తం 150 లక్షల రూబుల్సు విలువగల, స్టాలిన్ బహుమతుల సమగ్ర జాబితా ఈరోజు ప్రకటించారు. అణుశక్తి పరిశోధనలకూ, వివిధ మారణాయుధ నిర్మాణ కౌశలమునకూ కూడా, ఆ జాబితాలో చాలా బహుమతులున్నవి.

ఆయుధ నిర్మాణ శాఖకు 13 బహుమతులు-వీటి మొత్తం విలువ లక్ష రూబుల్సు: ఈ 13 బహుమతులనూ 50 మంది పరిశోధకులు పంచుకోవలసి వుంటుంది. ఆ నూతనాయుధాల వివరాలేమీ ప్రకటించబడలేదు.

మందుగుండు నిర్మాణశాఖలో మూడు బహుమతులు- వీటిని పంచుకోవలసినవారు 15 మంది.

ఈ శాఖలో బహుమతులు పొందినవారిలో ప్రసిద్ధులు ఇద్దరు - ఇంజనీర్ డిజైనర్, లాడీ మైకోవిచ్ లాడిచిరోవ్, ఛీఫ్ డిజైనర్ వస్లీ ఐగాద్రిలోవిచ్ షైను నోవ్ లు.

అణుశక్తి పరిశోధనలకూ, యురేనియమ్ రేడియో ప్రసరణ శక్తి పరిశోధనలకూ, జార్జి ఐడిమిట్రివిచ్ లాటియాకోవ్ అనే ఆయనకు 200,000 రూబుల్సు బహూకరించారు; ఈయన లెనిన్‌గ్రాడ్ పరిశోధనా కేంద్రంలోని పదార్థ విజ్ఞాన శాస్త్రవేత్త: యురేనియస్ జాతికి చెందినవాడు.

వాయుమండలంలో పరితలంలో, కాస్మిక్ కిరణ ప్రసారాల విషయంలో పరిశోధనలు జరిపినందుకు సైబీరియా కాలువిచ్ చెర్నావ్ అనే ప్రొఫెసరుకు 200,000 బహూకరించారు. ఈయన లెనిన్‌గ్రాడ్ పదార్థ విజ్ఞాన కేంద్రానికి చెందినవాడు.

## ఇజ్రాయిల్‌కు సిరియా హెచ్చరిక

### "సమాన ప్రాయాలోనే స్నేహం సాధ్యం"

#### కలనల్ జాయిమ్ ప్రకటన

దమాస్కస్, ఏప్రిల్ 9: "సిరియన్ సైన్యమును జ్ఞాపకముంచుకొని మసలవలసినది" అని సిరియా నూతన్నాధిపతి కల్నల్ హుస్నీ జాయిమ్ నేడు ఇజ్రాయిల్‌ను సర్వసేనాని ఆజ్ఞలను శిరసావహించుడు! అతనిని ప్రేమించుడు." అని అతడన్నాడు.

సిరియన్ సరిహద్దులకు గతవారం యూదుసేనలు దాటి వచ్చుటను గూర్చి చెప్పుచు" మాకు దౌర్జన్యపు భాష అర్థం కాదు, ఇజ్రాయిల్‌తో శాంతి స్నేహములను మేము కోరుచున్నాము. కాని సమానప్రాయాలలో మాత్రమే. అని కల్నల్ జాయిమ్ అన్నాడు.

పార్లమెంటు ఎన్నుకొన్న బనువరకూ సిరియన్‌మాజీ అధ్యక్షుడు, ప్రధాని జైలులోనే ఉంటారనీ, వారి విషయం ఆ తరువాత పార్లమెంటే నిర్ణయించుననీ కూడా అతడనెను.

ట్రాన్స్‌జోర్డన్‌రాజు అబ్దుల్లా ఒక టర్కిష్ వార్తా విలేఖరితో నేడు ప్రసంగించుచు "సిరియాలో గతవారం జరిగిన రక్తరహిత పరిణామం వలన సిరియాను దృఢపరుపగల నాయకులు పైకిరావచ్చుననీ, అట్లు జరిగి సిరియా ఇరాక్‌తో స్నేహము నేర్పరచుకొన్నపిదప టర్కీతో ఆ రెండూ స్నేహమును సాధింపగలవనీ" చెప్పినట్లు తెలియుచున్నది.

సిరియా, ఇరాక్, లెబనాన్, ట్రాన్స్‌జోర్డన్ రాజ్యాలు కలిసి విశాల సిరియా ఏర్పడే రోజులు దగ్గరకు వచ్చినవనికూడ అబ్దుల్లా అన్నాడట.

## భారత భూభాగంపై పాకిస్తాన్ ప్రజల దాడులు

### ఒకని మరణము, నాల్గు పశువుల అపహరణ

సిమ్లా, ఏప్రిల్ 9: మార్చి ద్వితీయార్థభాగములో పాకిస్తాన్‌వాసులు భారతభూభాగముపై నాల్గుసార్లు దాడులుగావించిరని, ఇందువల్ల ఒక భారతీయుడు మరణించుటయు, 9 పశువులు నష్టమగుటయు తటస్థించెనని అధికారరీత్యా నేడు డిచ్చట తెలిసినది.

ఆయుధపాణులగు దాదాపు 6 గురు పాకిస్తానీలు అమృతసర్ జిల్లా భానేవాలా గ్రామమువద్ద భారత భూభాగములోనికి ప్రవేశించిరి. గ్రామస్థులు కేకలు వేయగా వారు వెళ్లిపోయిరి. కాలికి బుద్ధి చెప్పుచు వారుఒకసిక్కును కాల్చిచంపిరి.

30, 40 మంది పాకిస్తానీలు పొలములలో మేయుచున్న పశువులను దొంగలుకు పోవుటకై ఫిరోజ్‌పూరుజిల్లా పి. కే. ఆటూర్ గ్రామమువద్ద హఠాత్తుగా ప్రత్యక్షమైరి. ఒక గ్రామస్థుడు తుపాకి కాల్చగా వారు పారిపోయిరి. సరిహద్దు పోలీసులు కూడ త్వరితగతిని ఆ గ్రామమునకు వెళ్లిరి. కాని వారు గ్రామము చేరక పూర్వమే దుండగీండ్రు ఒక ఎద్దును తోలుకొని పారిపోయిరి.

లెక్కన రెండుదాడులు గురుదాస్‌పూరు జిల్లాలో జరిగెను. ఒక దాడిలో హుంకీఖజరపూర్ గ్రామమునుండి పాకిస్తాన్ దుండగీండ్రు రెండు దున్నలను తోలుకుపోయిరి. మరియొక గ్రామములో వారు 6 పశువులను దొంగలుకుపోయిరి.

## పంజాబ్ ఎక్స్‌ప్రెస్ పట్టాలు తొలగి 40 మంది మరణం

బెనారెస్, ఏప్రియల్ 10: బెనారెస్‌కు రెండు మైళ్లదూరంలో, పూన్గా అనే శాఖున నేడు ఉదయం పట్టాలు తొలగి, పంజాబ్ ఎక్స్‌ప్రెస్ తలక్రిందులై పోయింది.

40 మంది వెంటనే మరణించారు. మరి వలఫైమందికి ప్రమాదకరమైన గాయాలు తగిలినై.

ఒక రైలుపెట్టె పొంతం గుంపులై పోయింది. మరి మూడు పెట్టెలుకూడాబాగా శిథిలమైపోయినై.

వైద్యసహాయం వెంటనే ఈ సంఘటన జరిగినచోటికి పంపించబడింది. క్షతగాత్రులను ప్రథమచికిత్సచేసి హాస్పిటల్‌కు చేరవేయబడ్డారు.

పోలీసు, రైల్వేఅధికారులు ఆశావకు వెళ్లారు. పట్టాలు తొలిగించబడినట్లు తెలుస్తున్నది. పోలీసువారు దర్యాప్తు చేస్తున్నారు.

## కామన్వెల్తు ఎక్కడకూలిపోతుందో అని స్మట్స్ భయం

### భారతప్రభుత్వ వైఖరి విమర్శ

కేప్‌టౌను, ఏప్రిలు 9: దక్షిణాఫ్రికా మాజీ ప్రధాని ఫీల్డుమార్షల్ స్మట్స్ బ్రిటిష్ రాచరికాన్ని సర్తింపక, రిపబ్లిక్‌గా ఉంటి, కామన్వెల్తు కూటమితో ఏదో ఒక భిన్నమైన సంబంధమును ఏర్పాటుచేసుకోవాలనే భారత ప్రభుత్వాలోచనను తీవ్రంగా విమర్శించాడు. ఉంటే పూర్తిగా నిర్బంధంగా కామన్వెల్తులో ఉండడం లేదా, పూర్తిగా ఇవతల వుండిపోవడమే గాని మధ్యమార్గం అనేదిలేదని స్మట్స్ వాదిస్తున్నాడు. భారతదేశం కామన్వెల్తులో చేరక విడిగా ఉండిపోదలిస్తే, ఏదో ఒక భిన్నమైన ప్రత్యేక ఒడంబడిక చేసుకొని మాత్రమె కామన్వెల్తుతో సంబంధం కల్పించుకొనడానికి వీలుందని అన్నాడు.

ఇప్పుడున్న కామన్వెల్తు భావనను మార్చదలచినా, నాశనం చేయదలచినా, చివరికి ఏదో ఒకరూపంలో ఆ వ్యవస్థను నిలపాలనుకుంటే నానాజాతిసమితి, ఐక్యరాజ్యసమితి మున్నగు సంస్థలకు ఉన్న మాదిరి లిఖిత నిబంధనావళి ఒకటి వుండాలని సూచించారు. ఇలాంటి ఏర్పాటుకు భారతదేశంగాని, మరి ఏ యితర దేశంగాని సమ్మతింపదని అంగీకరిస్తూ భారతదేశం వాంఛిస్తున్న స్థాయిని కామన్వెల్తు భావనతో సమన్వయం చేయడం సాధ్యంగాదన్నారు. కామన్వెల్తును శూన్యం చేయవద్దంటూ అలాంటి పరిణామం సంప్రాప్తం కాకుండ విశేషజాగ్రత్త తీసుకోవాలన్నారు. కామన్వెల్తు ఒక పిల్ల నానాజాతివలె ఉందని చెప్పి భారత దేశ దృక్పథం అసలు మూలసిద్ధాంతాలకే ముప్పు తెచ్చి పెడుతున్నదని హెచ్చరించారు.

కామన్వెల్తు భవిష్యత్తును గురించి స్మట్స్ తన అభిప్రాయాలను ఇలా వివరించాడు: "ఒకదేశం కామన్వెల్తునుండి విడిపోతే ప్రత్యేక ఒడంబడికద్వారానే కామన్వెల్తుతో సంబంధం పెట్టుకొని ఉండగలదు. కామన్వెల్తు అంటే ఇప్పుడు ఉండే విస్పష్టభావనను అలాగే ఉంచివేయాలి. ఏదో అనిర్వచనీయమైన సంబంధాల్లో ఆ భావనను లీనం చేయలేము. భారతదేశం రిపబ్లిక్‌గా కామన్వెల్తు వెలుపల ఉండదల్చుకుంటే పశ్చిమ యూరపు సమాఖ్య, ఉత్తరఅట్లాంటిక్ రక్షణ ఒడంబడికమాదిరివేరే ఒడంబడికలను చేసుకొని కామన్వెల్తుతో సంబంధం పెట్టుకొని ఉండవచ్చును. కామన్వెల్తు ఈ పశ్చిమ యూరపు సమాఖ్య, ఉత్తర అట్లాంటిక్ రక్షణ ఒడంబడికలకు భిన్నమైనది. ఆ కామన్వెల్తుతో చెలగాటం కూడదు."

### భారతంలో కృత్రిమవర్షం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 9: భారతంలో కొన్ని ప్రదేశాలలో కృత్రిమ వర్షాన్ని కురిపించడంలో పరిశోధనలను జరపడానికై భారతప్రభుత్వం ఆస్ట్రేలియన్ శాస్త్రజ్ఞులతో సంప్రతింపులను జరిపి ఒక ప్రణాళికను తయారుచేసినదని తెలుస్తున్నది.—గ్లోబ్.

### వచ్చేఅంతర ఆసియా సమావేశం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 9: రెండవ అంతర ఆసియా సమావేశం ఈ సంవత్సరంలో ఆఖరి మాసములలో ఫిలిప్పైన్స్ రాజధాని, మనీలాలో జరుగుతుందని తెలుస్తున్నది.

మొదటి సమావేశం 1947 మార్చి, ఏప్రిల్ మాసాలలో న్యూఢిల్లీలో జరిగింది. —గ్లోబ్.

### మాంటెసోరీసతికి నోబెల్ శాంతి బహుమానము

#### ఇటలీ విద్యాశాఖ సూచన

బొంబాయి, ఏప్రిల్ 9: నోబెలు శాంతి బహుమానమునకు ఇటలీ విద్యాశాఖవారు డా॥ మెరియా మాంటెసోరిని పేరు సూచించిరని, ఆమె కుమారుడు మారియో మాంటెసోరి నేడు చెప్పెను. ఈ సూచనలు భారత ప్రధాని పండిత నెహ్రూ, ఫ్రాంసు ప్రధాని, బ్రిటనునందలి లార్డు జార్జి లాంబరుగారలు సమర్థించిరని ఆయన చెప్పెను.

8 వ అంతర్జాతీయ మాంటసోరీ సభ ఈ సంవత్సరము ఆగస్టులో ఇటలీలో జరుగునని ఆయన చెప్పెను.

కరాచీలో ఉపాధ్యాయులను తర్ఫీదు చేయుటకు తల్లి కొడుకులిద్దరు రాబోవు వారము కరాచీ వెళ్లుచున్నారు.

### కృష్ణానది నీటి మట్టం

విజయవాడ, ఏప్రిల్ 9: కృష్ణానది నీటిమట్టం నేడు ఆనకట్టకు దిగువన 0.5 అడుగులున్నది.

## బర్మా సంధి సంప్రతింపుల భగ్నత

1 వ పేజీ తరువాయి

బడినని మాత్రమే ప్రభుత్వం ప్రకటించింది.

తీరా, ఇన్‌సేన్‌లో కేరన్ ప్రతినిధులు ఈ ప్రతిపాదనలు అంగీకారం కావని ప్రకటించారు. కాని, జూలై 4 వ తేదీకి శాంతి నెలకొల్పి, క్రొత్త ఎన్నికలకు అవకాశం కల్పించే దృఢసంకల్పంతో వున్న ఈ సంరక్షక ప్రభుత్వం, ఏకోవిధంగా అటు తెల్లపట్టె దళాలవారితో గాని, ఇటు కేరనులతో గాని సంధిచేసుకు తీరవలసిన ఆవశ్యకత వుందని ఇక్కడి అభిజ్ఞవర్గాల వారంటున్నారు.

తెల్లపట్టె దళాలవారి చేతుల్లోకి మళ్లా రెండు జిల్లాలు - రంగూనుకు వాయవ్యాన వున్న హెన్‌జెడా, థారావాడీ జిల్లాలు- అదనంగా వెళ్లాయి. ఎగువ, దిగువ బర్మాలలో కేరనుల ప్రతిఘటన ఇంకా తీవ్రతరంగా సాగుతూనే వుంది. ఈ పరిస్థితులన్నీ చూస్తే, ఏకోవిధంగా సంధి యేర్పాట్లు జరిగితేనేగాని, దేశంలో యేవిధంగానూ, శాంతి వాతావరణమేర్పడి, జీవానికి క్షేమస్థాయి చిక్కే సూచనలేమీ కనిపించటం లేదు.

## అమెరికా సైనిక బడ్జెట్

1 వ పేజీ తరువాయి

ఏటంబాంబు ఉండే అవకాశం లేదు కనుక ఈ లోగా యుద్ధం వచ్చే ప్రమాదంలేదని విమానదళ నాయకులు కేటాయింపు సంఘమువారికి నచ్చజెప్పిరి.

నౌకాశాఖ

అమెరికాకు మొత్తం 731 నౌకలదళముండవలెనని కూడ బడ్జెట్ ప్రతిపాదించుచున్నది. ఈ దళము మిస్సోరి-అనే యుద్ధనౌక, 8 భారీ క్రూయిజర్లు, 11 సరఘరా నౌకలు, 18 క్రూయిజర్లు, 170 డిస్ట్రాయర్లు, డిస్ట్రాయరు వాహకనౌకలు, 80 జలాంతర్గాములు, 99 మందుగని నౌకలు, గస్తీ నౌకలు, ఇంకా ఇతర రకాల నౌకలు ఉన్నవి.

అమెరికన్ నౌకాదళము ప్రపంచంలో ఏభాగమందైనా క్షణంలో దెబ్బతీయుటకు తగినంత సామర్థ్యం కలిగినదని నౌకాదళ నాయకులు కేటాయింపు సంఘంలో చెప్పెను. కాని నౌకాశాఖ కార్యదర్శి సల్లివాన్ "మరొక అగ్రరాజ్యం ఈ నిముసంలో మనకంటే 250 జలాంతర్గాములను అధికంగా కలిగియున్నది." అని స్పష్టంగా సూచించెను.

## ఆయుర్వేద వైద్య విధానం

1 వ పేజీ తరువాయి

స్త్రీ, ఇతర పాశ్చాత్యశాస్త్రములలోకూడా ప్రవేశముండవలెనని, సంస్కృతము నర్థము చేసికోగల శక్తి యున్న చాలుననీ చో ప్రాకమికే చెప్పుట సమర్థనీయము కాదు. వర్తమానముల నుండి లౌక్యపారిభాషికా గ్రంథములకు సంస్కృత భాషాజ్ఞానము చాల కావలెను.

ఆయుర్వేదమునకు సరియైన ప్రోత్సాహమిచ్చినచో త్వరలో అది మిగతా విధానములను సమన్వయించుకొని ఇండియాకే కాక యావత్ప్రపంచమునకు కల్యాణదాయకము కాగలదు."

## తొలిఘట్టం పూర్తి

### పాకిస్తాన్ ప్రభుత్వం కాశ్మీర్ కమీషన్ చర్చలు

కరాచీ, ఏప్రిల్ 9: పాకిస్తాన్ ప్రభుత్వంతో కాశ్మీర్‌కమిషన్ సభ్యులు రావల్పిండిలో జరుపుతున్న యుద్ధవిరమణ సంప్రతింపులలో తొలిఘట్టం సమాప్తమైనది. కమిషన్‌సభ్యుడు ఆర్ హైలండ్స్ రేపు విమానంలో ఢిల్లీకి వెళ్లుచున్నారు.

ఇంతవరకూ జరిగిన సంభాషణలు సంతృప్తికరంగానే సాగినట్లు, తెలియుచున్నది.

ప్రస్తుతం రావల్పిండిలో'నున్న కమిషన్ అధ్యక్షుడు ఏప్రిల్ 8 వ తేదీన, తిరిగి నేటి ఉదయము పాకిస్తాన్ ప్రభుత్వ ప్రతినిధులతో కాశ్మీర్ సంధితో ఒడంబడిక విషయమై మరికొన్ని చర్చలు జరిపెననీ, మొదటిసారి చర్చలు రెండు గంటలసేపు, రెండవసారి చర్చలు $1\frac{1}{2}$ గంటసేపు జరిగినవనీ, కమిషన్ అధ్యక్షునితోపాటు అమెరికన్ ప్రతినిధి మాకోన్, సమితి కార్యదర్శికి స్వంతప్రతినిధియైన ఎరిక్ కోల్బన్, అమెరికన్ ప్రతినిధికి సలహాదారైన విలియమ్సుకూడ ఈ చర్చలలో పాల్గొనిరనీ, కమిషన్ నేడు ప్రకటన చేసెను.

మదరాసు, ఏప్రిల్ 9: మదరాసు ప్రభుత్వ ఆహారమంత్రి డా॥ రాజన్ 11 వ తేదీ ఉదయం కాశిలో బయలుదేరి మరల 17 వ తేదీ ఉదయమునకు తిరిగి వచ్చెదరు.

## కామన్వెల్త్‌లో భారతదేశ స్థానం

### ప్రధానికి సర్వాధికారమిస్తూ కార్యవర్గనిర్ణయం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 9: కాంగ్రెస్ కార్యవర్గం నేడు ఉదయం సమావేశమై భారతప్రధాని కామన్వెల్తు సమావేశం గురించి చెప్పిన విషయములను సావధానంగా విని, తన అభిప్రాయములను తెలిపి, అంతిమ నిర్ణయానికొరాన్ని పండిట్ నెహ్రూకే వదలి వేయడానికి నిర్ణయించినట్లు తెలుస్తున్నది.

## "కుటీర పరిశ్రమల నభివృద్ధి చేయాలి"

### గవర్నర్-జనరల్ ఉద్బోధ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 9: కుటీర పరిశ్రమల వస్తువులు మంచివా, ఫ్యాక్టరీ వస్తువులు మంచివా అనే తారతమ్య నిరూపణ జోలికి పోకుండా, కుటీర పరిశ్రమలను అభివృద్ధి చేయుటకు ప్రజలంతా నడుము కట్టవలెనని నేడిక్కడ భారతప్రభుత్వంచే స్థాపించబడిన కుటీర పరిశ్రమల ఎంపోరియంకు ప్రారంభోత్సవము చేయుచు గవర్నర్ జనరల్ రాజగోపాలాచారిగారు ఉద్బోధించిరి.

రాజాజీని ఆహ్వానించుచు పారిశ్రామిక మంత్రి డా॥ శ్యామప్రసాద ముఖర్జీ "ప్రభుత్వము కుటీర పరిశ్రమలను, యాంత్రిక పరిశ్రమలను సమానంగా అభివృద్ధి చేయదలచినది" దని చెప్పెను.

నేటి సమావేశమునకు బెల్జియన్ రాయబారి, రష్యన్ రాయబారి, డా॥ పట్టాభి, ప్రభుత్వ సభ్యులు అరుదెంచిరి.

భారత ప్రభుత్వపు పారిశ్రామిక శాఖా మంత్రివర్గంచే స్థాపించబడిన ఈ ఎంపోరియము కుటీరపారిశ్రామికులు తమ సరకును సులభముగా విడుదల చేయుటకు వీలుగా ఏర్పరచబడినది. ఇది శాశ్వతమగు సంస్థ.

### రెడ్‌హిల్సు చెరువు నీటి మట్టం

చెన్నపట్నం, ఏప్రిల్ 9: రెడ్‌హిల్సు చెరువు నీటిమట్టం నిన్న 36.66 అడుగులుగా నుండెను.

నీటికై వత్తిడి తగ్గించుటకు తిరువళ్లికేణి పెద్దవీధులలో నొక పెద్ద బావికి పంపును కార్పొరేషనువారు పెట్టియున్నారు.

### మదరాసు అసెంబ్లీ కవున్సిల్ సమావేశములు

మదరాసు, ఏప్రిల్ 9: మదరాసు అసెంబ్లీ ఏప్రియల్ 18 న కవున్సిల్ 20 న సమావేశమగుచున్నవి.

అన్వయించని కాలములోని చట్టములను తిరిగి ఆమోదించు బిల్లులు చర్చించబడును.

సమావేశము ప్రారంభమున, రాజీనామాలు ఇచ్చిన మంత్రులు ప్రకటనలు చేయునదీ లేనిదీ ఇంకనూ తెలియలేదు.

### శాసనసభా కాంగ్రెస్‌పక్ష సమావేశము

మదరాసు, ఏప్రిల్ 9: డిప్యూటీస్పీకరు, ఇతర కార్యనిర్వాహకులను ఎన్నుకొను నిమిత్తం శాసనసభా కాంగ్రెస్‌పక్ష సమావేశము ఏప్రియల్ 20 ప్రాంతమున జరుగవచ్చునని తెలిసినది.

## కమ్యూనిస్టుల జవాబు

(1-వ పేజీ తరువాయి)

సమాధానముగా రేడియో బ్రాడ్‌కాస్టు ద్వారా తెలిపెను. సంఘ రాయబారములలో జరుగు నిర్ణయములు చైనీస్ ప్రజల విముక్తికై జరుగుచున్న కృషికి సహాయపడునా? దేశ సమస్యలను అవిశాంతి యుతములను మార్గములద్వారా పరిష్కరించునా అను విషయము పై ఇది ఆధారపడియుండునని.

చైనా సమస్యల నన్నిటిని పరిష్కరించుటలో తోడ్పడవలెనని కోరుచు, నూతన చైనాను నిర్మించుటకు యితర ప్రజానాయకులతో కలిసి పనిచేయ తాను సిద్ధముగా నుంటెనని తెలుపుచు నాన్కింగ్ చైనా అధ్యక్షుడు గావించిన విజ్ఞప్తికి యిచ్చిన సమాధానము కమ్యూనిస్టుల పద్ధతుల ననుసరించియు, కమ్యూనిస్టుల సిద్ధాంతముల ననుసరించియు వారు పంథి గాయ బారములను సాగింప నంగీకరించుటచేత సమస్యలు పరిష్కరించబడుట కష్టము కానట్లు కనిపించుచున్నది. యుద్ధ నేరస్థుల సమస్య గూడ కష్టమైనది కాదు. ప్రజలకు విముక్తి చేకూర్చుటకు, వారి క్షేమలాభములను పెంపొందించుటకు, ఉత్పత్తి నిర్మాణమును ప్రోత్సహించుటకు మేము కృషి చేసెదము. ఇరుపక్షముల వారు త్రికరణశుద్ధిగా శాంతిని వాంఛించుచున్నప్పుడు, ఈ ఉద్దేశ్యమునకై దేశభక్తులందరితోను కలిసి పని చేయుట కమ్యూనిస్టులకు సంతోషదాయకముగా నున్నది." అని తన జవాబున బ్రాడ్‌కాస్టులో కమ్యూనిస్టు నాయకుడు తెలిపెను.

## ద్వారం వెంకటస్వామి నాయుడుగారు

### విజయవాడలో సన్మానం

విజయవాడ, ఏప్రిల్ 9: ఆంధ్రగాన సభ అధ్వర్యమున గతసోమవారం సాయంకాలం, రామమోహన గ్రంథాలయ భవనంలో సంగీతకళానిధి, సంగీతరత్నాకర, శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడుగారికి వైభవోపేతంగా సన్మానం జరిగెను. సన్మానసభకు విజయవాడ సబ్ జడ్జీ డి. ఆర్. వెంకటేశయ్యరుగారు అధ్యక్షత వహించిరి.

ఉపన్యాసమున నాయుడుగారు రైలుదిగగానే స్టేషనువద్ద పారుపల్లి రామకృష్ణయ్య, అయ్యంకి తాండవకృష్ణ, అరిపిరాల సత్యనారాయణ ఇతర గానకళాభిమానులు వారికి స్వాగతమొసంగి, ఊరేగింపుతో బసకు తీసుకొనివచ్చిరి.

గానకళావసంతులు, సంగీత కళాభిమానులు, కళాపోషకులు పలువురు సన్మాన సభకేతెంచిరి. ఆంధ్రగాన సభా ధ్యక్షులైన శ్రీ వల్లమాని సుబ్బారాయుడుగారు సన్మాన పత్రం చదివి, సన్మాన సంఘంతరపున నాయుడుగారికి ఒక వెండిషీల్డును బహూకరించిరి. శ్రీ పారుపల్లి రామకృష్ణయ్యగారు నాయుడుగారి గానకళా పాండిత్యప్రతిభను ప్రశంసించుచూ, దేశీయకళల పునరుద్ధరణకు ప్రభుత్వంవారు ప్రత్యేకసంస్థల నెలకొల్పి కళాసేవ చేయవలయునని కోరిరి. పాలపర్రు రామచంద్రరావు, అరిపిరాల సత్యనారాయణగార్లు నాయుడుగారి సంగీత జ్ఞాన మపారమని ఉగ్గడించుచూ ప్రసంగించిరి. శ్రీ వెంకటేశయ్యరుగారు ఇంగ్లీషులో ప్రసంగించుచు, నాయుడుగారి ఫిడేలువాద్యం ఆంధ్రదేశంలోనేగాక భారతదేశమంతా ప్రఖ్యాతి నొందినదనియూ, మొన్న చెన్నపట్నంలో జరిగినసన్మానం దాక్షిణాత్యులందరూ గర్వింపవగిన విషయమనియూ చెప్పిరి.

సన్మానమునకు సమాధానంగా నాయుడుగారిట్లు ప్రసంగించిరి.

"అణుకంతటి నాశక్తిని మేరువుగా ఉదారహృదయులై గ్రహించి, అనర్హుడనైనను, మీరుచేసిన యీ గొప్పప్రశంసకు గౌరవమునకు నేనెంతయు కృతజ్ఞుడను. ఈ గౌరవం నాకు కొక శాల్యమంది ఏకలవ్యముగా నే నారాధించు గానకళాదేవతకు, సర్వకళా నిలయమగు నా అనంగు దేశమాతకనియే భావించుచున్నాను. సరస్వతీ కృపావీక్షణమున ముమ్మందు నన్ను మించు కళావేత్తలు, కళారాధకులు లక్షలుగా ఆంధ్రభూమినే గాక సర్వ భారతావనియందు వెలయుదురని విశ్వసించుచున్నాను. విజయవాడ, విజయనగరములను నామసాదృశ్యమే గాక తత్వసాదృశ్యమును కళాసాదృశ్యముకూడ విశేషముగా చిరకాలమునుండి గలవు. అంతేగాక ఆంధ్రదేవీ హృదయమగు విజయవాడయందు ఆంధ్రగాన సభ అధ్వర్యమున యీ మహాగౌరవము పొందుట యెంతయు ఆనందదాయకం. సోదరాంధ్రులకు నా యందుగల సంపూర్ణాభిమానము, కళయందు గౌరవము నిరూపించుటచే ఆంధ్రజ్ఞాన పురోభివృద్ధి, భవితవ్యములయందు నా కెంతయును విశ్వాసం కలుగుచున్నది.

ఇంతకును నా హృదయమందు వెల్లివిరియుచున్న కృతజ్ఞతాభావము వాగ్రూపంగా చెప్పుట నాకు అశక్యము, అసమర్థుడను. నాకు హృదయము, వాగింద్రియము వాయులీనమే కొబట్టి, తద్వారా శక్తికొలది నా యీ కృతజ్ఞతాభావమును విన్నవించుకొందును."

ఉపన్యాసానంతరం నాయుడుగారు ఒకగంటసేపు ఫిడేలువాయించి సభికులను ఆనందాబ్ధి నోలలాడించిరి.

### తెనాలిలో శ్రీరామనవమి ఉత్సవాలు

తెనాలి, ఏప్రిల్ 7: శ్రీరామనవమి ఉత్సవముల సందర్భంలో మారుమార్కెటు మొదలగు ముఖ్య వీధులన్నిటిలోను బ్రహ్మాండమైన పందిళ్ళు వేయబడెను. పరిసర ప్రాంతాలనుండి వేలకొలది ప్రజలు ఉత్సవాలలో పాల్గొనిరి.

అన్ని పందిళ్ళలోను సీతారామ కల్యాణోత్సవాలు వైభవంగా జరిగినవి. ప్రతినిత్యము హరికథా కాలక్షేపం జరుగుచున్నది.

### వీరేశలింగం జయంతి

విజయవాడ, ఏప్రిల్ 7: ఆంధ్ర సంస్కృతీ సాహిత్యాల అభ్యున్నతికి మూలపురుషులైన కందుకూరి వీరేశలింగం పంతులుగారి, జయంత్యుత్సవాన్ని ఏప్రిల్ 16న ఆంధ్రదేశమంతటా జరిపి, అభ్యుదయ రచయితలు, కళాకారులూ, ఆ మహాపురుషునికి ఆశేషమైన వర్ధంతులు ప్రజానీకానికి అందచేయాలని కోరుచున్నాను. శ్రీ వీరేశలింగం గారి ప్రహసనాలను, ఇతర నాటకలను ప్రదర్శించటం, కవితాగోష్ఠులూ ఈ జయంత్యుత్సవంలో ఒక విశిష్టస్థానం పొందవలెను. అని ఆంధ్రాభ్యుదయ రచయితల సంఘ కార్యదర్శి ప్రయాగ కోదండరామశాస్త్రి గారు వ్రాసిరి.

## "ఏదీ ఒక పాట పాడరూ!"

### రేడియోలో "మేరా బచ్చా" కాలక్షేపం.

### ప్రధాని నెహ్రూ గోష్ఠి: బాలుర కోరిక

క్రొత్తఢిల్లీ, ఏప్రిల్ 9: నేటి సాయంకాలం 4-20 గంటలకు భారత ప్రధానమంత్రి పండిట్ నెహ్రూగారు చిన్నపిల్లల సమావేశమునందు ఉపన్యసించుచుండగా, ఆ సమావేశ కాలక్షేప మంతయును ఢిల్లీలోని ఆలిండియా రేడియోవారు భారత దేశములోని శ్రోతలకొరకును ఖండాంతరములలోనివారు, వినుటకొరకును బ్రాడ్‌కాస్టు చేసిరి. అది హిందూస్థానీ పిల్లల మీటింగు. ఆలిండియా రేడియోలో "మేరా బచ్చా" అను శీర్షికతో యిట్టి కాలక్షేపములను ప్రసారము చేయ తలంచిరి. ప్రముఖులైన నాయకులను పిల్లలతో సమావేశపరచి వారితో కొంత ప్రసంగ సంభాషణ సల్లాపములను జరిపించి ఆ ప్రసంగ సంభాషణ కాలక్షేపమును రేడియోద్వారా ప్రసారము చేయదలచిరి. అట్టి "మేరా బచ్చా" కాలక్షేపములలో ఇది మొట్టమొదటిది.

నేటిసమావేశములో పండిట్ నెహ్రూ తన విద్యాభ్యాసకాలమునాటి విశేషములను వివరించెను. ఇంగ్లాండులో హారో విద్యాలయమునందు తాను చదివిన దినములలో గడిపిన సరదా దినములను సుగ్రహపు స్వారీయందును, ఈతలాడుటలోను తన వినోదానుభవమును వర్ణించి చెప్పెను.

పిల్లలు అడిగిన పొడుపుకథవంటి చిక్కు ప్రశ్నకు నెహ్రూ జవాబు చెప్పుటకు ప్రయత్నించెను. కొంతవరకు దాని కిటుకును అందిస్తే ఆఖరుకు ఆపిల్లలడిగిన చిక్కుసమస్యకు సమాధానము చెప్పగలెను. నెహ్రూ తనకు విద్యనేర్పిన గురువులగూర్చి చెప్పుచు, నాకు లభించిన గురువులలోకల్ల ఉత్తమోత్తముడొక్కడే కలడు, అని కొంచెము సేపు పేరు చెప్పక ఆగెను. వెంటనే ఆ సమావేశంలోని పిల్లలందరూ ఏకకంఠంగా "గాంధీజీ" అని అరచిరి.

అప్పుడు తిరిగి నెహ్రూ ప్రసంగించుచు స్వతంత్ర భారతదేశములో పెరుగుచున్న మీరు అదృష్టవంతులు అని చెప్పెను. అయితే, గాంధీవంటి గురువులోకలిసి పెరిగిన నేనుకూడా అదృష్టశాలినేయనెను. నెహ్రూ తన ప్రసంగమును ముగించిన పిమ్మట ఏదైనా ఒకపాట పాడవలసినదని నెహ్రూను పిల్లలుకోరిరికాని, యీసమావేశ కాలక్షేపం లోపాట పాడుటకు నెహ్రూ మొట్టమొదట బేరము ఒప్పుకొని యుండవలేదు. అందువల్ల ఉపాయంగా ఒక సమాధానం చెప్పి తప్పించుకొనెను, నా జీవితంలో నేను బహు విషములైన వృత్తులను సాధకం చేసితినిగాని, గవాయిన్నృత్తిమాత్రం సాధకం చేయలేదు. నెహ్రూ అమాట చెప్పగానే పిల్లలందరూ గొల్లుమని నవ్విరి. ఆ సమావేశంలోని ఒక పిల్లవానిని పిలిచి నీ జీవితంలో నీకు గల గొప్పకోరిక ఏమిటని నెహ్రూ అడిగెను. నేను జవహర్లాలు అంతవాణ్ని కావాలని నా కోరికయని ఆ పిల్లవీరుడు బదులు చెప్పెను. ఆ మాటకు జవహర్లాలు మందహాసవదనులై బదులు చెప్పజాలకపోయెను.

"మీరు ఏదైనా పద్యమొకటి చదవండి" అని ఒక కుర్రవాడు సభలోనుంచి కేకవేసెను. అప్పటికి ఆ రేడియో ప్రోగ్రాం ముగియవచ్చెను. ఇంకా 25 సెకండ్ల టైము మాత్రమే ఉంది. అందుకని పండితనెహ్రూ బుజం తప్పించుకొన్నట్లుగా తల పంకించి యింకా మిగిలియున్న యీ పదిహేను సెకండ్ల వ్యవధిలో నన్ను పద్యం చదువవలెనని మీరు కోరజాలరని నా అభిప్రాయము అని నెహ్రూపండితుడు జవాబు చెప్పెను. అంతటితో యీ రేడియో ప్రోగ్రాం పూర్తి అయింది.

కాలక్షేపం పూర్తికాగానే నెహ్రూ పండితుని చేవ్రాలుకోసం పిల్లలు తమ జేబులలోనుంచి కర్రెన్సీనోట్లు పైకి తీయనంగాంచి నెహ్రూ ఆశ్చర్యపడినాడు.

ఆకరెన్సీ నోట్లమీదనే వారు నెహ్రూ చేత సంతకములు చేయించుకొన్నారు. నాలుగు సంవత్సరముల చిన్నబిడ్డ ఒక పెద్ద తెల్ల కాగితమును కొనివచ్చి ఆ కాగితం అంతా నిండేటట్లుగా దానిమీద నెహ్రూను సంతకం చేయవలసినదిగా కోరెను. నెహ్రూ విస్మయంతో కండ్లు పైకెత్తిచూచి ఆ కాగితం నిండేటట్లు పెద్ద సంతకము చేసెను. నెహ్రూ చేసిన సంతకములలోకెల్ల అది చాలా పెద్దది.

### తెనాలి మునిసిపాలిటీ స్పెషలాఫీసరు

తెనాలి, ఏప్రిల్ 7: ఈ మునిసిపాలిటీ స్పెషలాఫీసరుగా నియమింపబడిన సి. వి. సుబ్బయ్య గారుగారు నిన్న ఉద్యోగంలో ప్రవేశించిరి.

## సోషలిస్టు, కమ్యూనిస్టు అభిప్రాయాలు

### ఎరువుసొమ్ములని రాష్ట్రపతి పట్టాభి

బొంబాయి, ఏప్రియల్ 8: "ఈ సోషలిస్టులూ, ఈ కమ్యూనిస్టులూ చెప్పే యీ మాటలున్నాయే—ఇవన్నీ వట్టి యెరువు సొమ్ములు; కాలదోషం పట్టిన వట్టి బూజు సూత్రాలు; ఇవి అసత్యానికీ, హింసాకాండకూ దారితీస్తాయ్; వారిమాట లేవీ మీరు విశ్వసించకూడదు." అని రాష్ట్రపతి, ఈ రోజు రాత్రి మాటుంగలో యేర్పాటు చేయబడ్డ బహిరంగసభలో ప్రజలని హెచ్చరించారు. సమావేశానికి బొంబాయి రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు యస్. కె. పాటిల్ అధ్యక్షత వహించారు.

"మహాత్మాగాంధిగారి సోషలిస్టు సూత్రం చాలా సనాతనమైంది; ఎంతో ఉత్తమావర్శాలు కలది. భారతదేశానికి వున్న ఆర్థికచిక్కులన్నిటినీ ఎదుర్కొటానికి అది బలవత్తరమైన ఏకైకసాధనం; భారతదేశంలో వున్న 7 లక్షల గ్రామాలనూ బాగుచెయ్యటానికి ఆయన నిర్వచించిన సోషలిజం తప్ప మరో గత్యంతరం లేదు. పశ్చిమదేశాల సోషలిజానికి భారతదేశపు సోషలిజానికి హస్తిమశకాంతరం తేడావుంది. భారతదేశంలోవున్న పరిస్థితులు అర్థంచేసుకోకుండా, బయట్నుంచి, ఈ రకం తెలిసీ తెలియని అపమార్గ సిద్ధాంతాలను ఇక్కడికి దిగుమతి చేసుకోటానికి యెవ్వరూ అంగీకరించరు. భారతదేశంలోవున్న గ్రామీణప్రాంతాలన్నీ సహకారపద్ధతులపైన ఆధారపడి వున్నయేగాని, పోటీసూత్రాలపైన ఆధారపడలేవు. భౌతిక, ఆధ్యాత్మిక అవసరాలను రెంటినీ తీర్చగల ఉభయులకుభావ్యమైన ఈ సహకారం దేశం మొత్తంమీద పరివ్యాప్తంగావుంది."

క్రొత్తరాజ్యాంగం ప్రకారం రానున్న క్రొత్త ఎన్నికలనుగూర్చి ప్రస్తావిస్తూ పట్టాభిగారు ఇలా అన్నారు.

"ఎన్నెన్నో తీవ్రమైన నూత్న పరిణామాలు రానున్నై. అంతవరకూ సామాన్య పౌరులపక్షాన నిల్చుని, కాంగ్రెస్ ఇలాగే ప్రజాసేవ చేస్తూవుంటుంది.

"కాంగ్రెస్ జాతీయసంస్థ! భారతదేశానికి స్వాతంత్ర్యం తెచ్చిన యేకైక సంస్థ; ప్రజలంతా కాంగ్రెసును బలపరచండి. క్రొత్త రాజ్యాంగంలో అధికారమంతా ప్రజలచేతుల్లోవుంటుంది. ప్రజలు తమకున్న బాధ్యతలను సక్రమంగా వినియోగించి, మహాత్ముడు సాధించి యిచ్చిన స్వాతంత్ర్యాన్ని బలపరచి స్థాయికి తెచ్చుకోవాలి" అని ముగించారు.

## జమీందారీ బిల్లు నియమములు

### గవర్నరు జనరలు సూచన పరిశీలన

మదరాసు, ఏప్రిల్ 9: జమీందారీ బిల్లుకు గవర్నరు జనరలు ఆమోద లేఖ మదరాసు ప్రభుత్వమునకు అందినట్లు తెలుస్తుంది.

ఆమోదమిచ్చుచు జమీలలోని గనుల కంట్రాక్టులుగురించి పరిహారనియమములను సవరించి ప్రస్తావించినట్లు తెలుస్తుంది. నియమములు ఏవిధంగా ఇండియా ప్రభుత్వమునకు సంపవలసినది గనుల కంట్రాక్టులకు ఏ రూపముగ రక్షణ ఇవ్వబడునదీ స్పష్టముగవున్నట్లులేదు. ఈ విషయములన్నిటినీ మదరాసు ప్రభుత్వము పరిశీలించుచున్నది.

## బ్రిటనుకి అల్బేనియా నష్ట పరిహారం

హేగు, ఏప్రిల్ 9: అంతర్జాతీయన్యాయస్థానంలో 16గురు జడ్జీలు మూడునెలలు విచారించి, బ్రిటిషు యుద్ధనౌకలు రెండింటిని అల్బేనియా సముద్రమున 1946 అక్టోబరులో దెబ్బ పరచినందుకు అల్బేనియా 875,000 పౌనులు నష్టపరిహారం యివ్వాలని తీర్పు చెప్పిరి. 44 బ్రిటిషు నావికులు అప్పుడు చనిపోయిరి. 42 గాయపడిరి.

యుద్ధానంతరం అల్బేనియా సముద్రంలో గనులు లేకుండా మిత్రమండలివారు, జర్మనులు కూడా తుడిచివేసిరి కనుక, ఈ యుద్ధనౌకలు క్రొత్తగ అల్బేనియా వేసిన గనులవల్లనే చెడినవని బ్రిటిషు వారి వాదము.

అది సరికాదని, అల్బేనియా సముద్రంలోనికి బ్రిటిషు యుద్ధనౌకలు వచ్చుట అక్రమమని అల్బేనియా వాదం. (డి టి వి.)

## కస్పాజగన్నాధపురంఫిర్కా రైతు కాంగ్రెస్

అనకాపల్లి, ఏప్రిల్ 8: దక్షిణవిశాఖజిల్లా కస్పా జగన్నాథపురం ఫిర్కా రైతుకాంగ్రెసుసభ కస్పా జగన్నాథపురంలో వి.వి. రమణగారి అధ్యక్షతను జరిగింది. రైతుకాంగ్రెస్ అవశ్యకత రైతుల కర్తవ్యము పలువురు ప్రసంగించిరి. క్రొత్తసంవత్సరానికి అడారి సన్యాసినాయుడు అధ్యక్షుడుగను, కార్యదర్శిగను ఎన్నుకోబడిరి.

## స్మారక సభ

ఏలూరు, ఏప్రిల్ 6: నెహ్రూ నాట్యమండలివారు శ్రీ మల్లాది వేంకటకృష్ణశర్మగారి అధ్యక్షతను సమావేశమై ఏప్రిల్ 15న కీ. శే. బళ్లారి రాఘవాచార్యుని స్మారక దినోత్సవం జరుపుటకు నిర్ణయించిరి. సమావేశానికి ఎస్. వి. ఎల్. నరసింహాచార్యులు, కొంటచింతల సత్యనారాయణ, వేమూరి గగ్గయ్య, పంచాంగం రామానుజాచార్యులు, కొచ్చర్లకోట సత్యనారాయణ, మొలకలూరు గోపాలరావు రాజ్యశ్రీ మొదలగు ప్రముఖ నటీనటులు హాజరైరి. రాఘవాచార్యులుగారు ఆంధ్ర నాటకకళా వికాసానికి గావించిన అపార సేవను ప్రశంసిస్తూ పలువురు ప్రసంగించిరి.

## "యుద్ధకాలంగా భావించి ఆహార సమస్యను పరిష్కరించాలి"

### జయరాందాసు దౌలత్‌రామ్ ఉద్బోధ

పాట్నా, ఏప్రిల్ 8: నేడు పాట్నాలో సమావేశమైన బీహారురాష్ట్ర కోఆపరేటివు ఫెడరేషను మహాసభలో ఇండియా ప్రభుత్వ వ్యవసాయశాఖామంత్రి జయరామదాస్ దౌలత్‌రామ్‌గారు ఉపన్యసించుచు ఇట్లు చెప్పిరి:

యుద్ధకాలంలో మనము ఎటువంటి జరూరు ఆవశ్యకముగా భావించి ఆహార సమస్యలను పరిష్కరించెడమో అదేరీతిగా యిప్పుడుకూడా మనఆహార సమస్యలను మనము పరిష్కరించుకొనవలెను. యుద్ధరంగంలో నున్నవారికి అయుధసామగ్రులనుసప్లయి చేసినవిధముగానే ఆహారపదార్థములనుకూడా సమృద్ధిగా మనము సప్లయి చేయుచుండవలెను. గ్రామాలలోకృషిచేయుచున్న వారికిఅవసరమునిమిత్తమై ఇనుము, ఉక్కు, సిమెంటు బొగ్గు, విత్తనాలు, ఎరువు పదార్థాలను సమృద్ధిగా సప్లయిచేయవలయును. ఆహార పదార్థములను దేశపరిపాలన నిర్వహించెడి ప్రభుత్వ పరివారము యీసర్తు పోషింపవలెను. ప్రతి గ్రామంలోనూ ఇందుకొరకై ఏవిధమైన ఏర్పాట్లు చేయవలెనో ముమ్మరంగా ఆలోచించి గ్రామమునే ప్రాతిపదికగా గ్రహించి ఆహారోత్పత్తికై ఒక పథకమును నిర్ణయించవలెను. గ్రామముల శక్తిసామర్థ్యమును వారి వస్తుసంపత్తిని గ్రామసౌభాగ్యమునకై సమష్టిగా వినియోగింపబడునట్లుగా సంపూర్తికరించవలెను. ఈ సమష్టి సహకార జీవితము ప్రతిగ్రామంలోను జీవనాడివలె అడుచుండవలెను. దేశాభ్యాలమాచినను, రైతులక్షాం దూచినను సస్యాభివృద్ధి పంటల అభివృద్ధి అత్యంతావశ్యకము. సర్వార్థ సహకార సంఘములు గ్రామాలలో ప్రతిచోటను వెలయవలెను. అత్యంత శీఘ్రకాలములోనే గ్రామపంచాయితీలు ఏర్పడవలెను. ప్రతిగ్రామంలోను సర్వార్థ సహకార సంఘములను ఏర్పాటు చేసినయెడల మహోత్కృష్ట కార్యమును మనము నెరవేర్చినవారమగుదుము. ఈ విధమైన గ్రామాభివృద్ధిని సాధారణ దినములందు నిదానంగా సాగించవచ్చును. కాని ప్రస్తుతము ఏర్పడియున్న జరూరు పరిస్థితులలో చాలా అసాధారణమైన త్వరితగతిని గ్రామ జీవితమును సంస్కరించవలెను. ఇతర ప్రభుత్వ సమస్యలన్నింటికంటే దీనినే ముమ్మరంగా పరిష్కరించవలెను. ఇది ప్రభుత్వముయొక్క ప్రధమ కర్తవ్యము. ఏదో విధమైన సహకార సంఘములను విరివిగా వ్యాప్తిలోనికి తీసికొనవలెను. మన మిప్పుడు విదేశాలనుండి ఆహార ధాన్యమును దిగుమతి చేసికొనుచున్నాము. ఈ విదేశీధాన్యాల దిగుమతిని 1951 సంll అనంతరము ఆపివేయవలెను. మనదేశములో ప్రస్తుతము పండింపబడుచున్న నోధుమలు ఏయ్యాము కంటె రెండురెట్లుగా వాడించినయెడల, మనజనసంఖ్యకు రెట్టింపు జనసంఖ్యను కూడా భరించగలము. సహకార సంఘములద్వారా గ్రామాలను వృద్ధిలోనికి తెచ్చినయెడల లంచగొండితనమును దుర్వ్యవహారమును పూర్తిగా నిర్మూలించ గలుగును.

## బీర్బల్ సహాని మరణం

### ప్రఖ్యాత వృక్ష శాస్త్రజ్ఞుడు

లక్నో, ఏప్రిల్ 9: సుప్రసిద్ధ వృక్షశాస్త్రవేత్త లక్నో విశ్వవిద్యాలయప్రొఫెసర్ డా॥ బీర్బల్ సహాని సుండెజబ్బునల్ల యీ అర్ధరాత్రి స్వగృహంలో మరణించెను. సహానికి నిన్నరాత్రే గుండెపోటు వచ్చింది. అప్పటినుంచిపూర్తిగా స్పృహ రాలేదు. లక్నో వైద్యశిఖామణులెంత ప్రయత్నించినా సహాని ఆరోగ్యస్థితి ప్రమాదకరంగా క్షీణించడం ఆగిపోలేదు. యీ రాత్రి సరిగా 12 గంటల 5 నిముషములకు సహాని స్వర్గస్థుడైనాడు. సహానికి వయస్సు 58.

స్టాక్‌హోంలో జరుగబోయే అంతర్జాతీయ వృక్షశాస్త్రజ్ఞుల కాంగ్రెస్ సప్తమ సమావేశ అధ్యక్షపదము నలంకరించుటకు సహాని యెంచుకోబడినాడు.

## మిలిటరీ గీతమునకు బహుమతులు

### సర్వసేనాని ప్రకటన

న్యూఢిల్లీ, ఏప్రిల్ 8: మిలిటరీ గమన విన్యాసపు సంగీతయున కను వైన సన్నిగా గీతమును వ్రాసినవారికి ఒక్కొక్కటి 50 రూ. చొప్పున చొప్పున 12 బహుమతుల నివ్వెదమని భారత సర్వసేనాధిపతి ప్రకటించెను.

సులభ గ్రాహ్యమగు హిందూస్థానీలో, వాద్యములకు, ముఖ్యముగా మిలిటరీ బ్యాండుల పైని వాయింపవీలయినట్లుగా గీతము లుండవలెను. అన్నిటిలోనూ బాగున్న 12 ఈ గీతముల నేర్పటకు సైనిక ప్రధాన కార్యాలయం వారొక నిపుణుల సంఘమును నియమించెదరనీ, వారి నిర్ణయములే అంతిమములుగా పరిగణింపబడుననీ, ఆమోదింపబడిన గీతములు కార్యాలయపు సొత్తు అగుననీకూడ ఆయన ప్రకటనలో నున్నది.

## జూన్‌నుంచి హైద్రాబాద్ పాఠశాలల్లో ప్రాంతీయభాషలో విద్యాబోధ

హైదరాబాద్, ఏప్రిల్ 9: 1949 జూన్‌నుంచి, హైదరాబాద్ సంస్థానంలో మిడిల్ స్కూళ్ళన్నింటిలోనూ, 5, 6, 7 తరగతుల బాలబాలికలకు తెలుగు, మరాటి కన్నడభాషలలో విద్యగరపుటకు హైదరాబాద్ మిలిటరీ ప్రభుత్వం నిశ్చయించింది.

హైదరాబాద్, సికింద్రాబాద్ నగరములలోనూ, ద్విభాషా పట్టణములలోనూ, ప్రభుత్వపాఠశాలలో తెలుగు మరాటి కన్నడ హిందుస్థానీ భాషలలో వేర్వేరు తరగతులు ఏర్పాటుచేయబడును. అయితే ఆయాభాషలు మాతృభాషగాగల విద్యార్థుల సంఖ్య తగినంతగా ఉంటేనే ఈ ఏర్పాటు చేయబడును.

### బాలికలకు విద్యా సౌకర్యాలు

బాలికలకు విద్యా సౌకర్యాలు అధికంగా కలుగ జేయవలెననే ఉద్దేశ్యంతో హైదరాబాద్ ప్రభుత్వం విద్యానిబంధనావళి చట్టమును సవరించెను. దీని ప్రకారం బాలుర పాఠశాలల ప్రధానోపాధ్యాయులు, బాలికల తండ్రులు తమ పిల్లలను ఆ పాఠశాలల్లో చేర్చుకోవలసిందిగా కోరినచో, అంగీకరించ వచ్చును.

## రోవన్ హత్యకేసు

### తాను నిర్దోషినని సయ్యద్ హబీబ్ అహమ్మద్ వాదన

హైదరాబాదు, ఏప్రిల్ 8: రోవన్ హత్యకు ప్రోద్బల మిచ్చెనని ఆరోపింపబడిన బ్రిగేడియర్ సయ్యద్ హబీబ్ అహ్మద్ నేడు కోర్టు మార్షల్‌లో సాక్ష్యమిచ్చుచు తాసీ సందర్భములో పూర్తిగా నిర్దోషినని వాదించెను.

రోవనును షూట్‌చేయమని ఆజ్ఞాపించ వలసిన అవసరంగాని, ఉద్దేశ్యంగాని తనకు లేదని బ్రిగేడియర్ అహమ్మద్ చెప్పెను. రోవన్‌కు కాపలాగా నియమించబడిన జమేదార్ గులాం మహమ్మద్‌ను, జమేదార్ మీర్జా అబ్దుల్ ఖాదర్‌ను రోవన్ హత్య విషయమై తాను ప్రోత్సహించితిననే ఆరోపణ కేవలం అపవాదని అతడు అన్నాడు.

సిడ్నీకాటన్ హైదరాబాదుకు రహస్యంగా ఆయుధ సరఫరాచేయుట అతనికీ, అప్పటి సంస్థాన ప్రభుత్వమునకూ సంబంధించినదేగాని తనకేమీ సంబంధించినది కాదనీ, హైదరాబాదు సైన్య ఆయుధముల విషయంలో తనకట్టి జోక్యానికి కారంలేనందున, ఆరహస్యం భారత ప్రభుత్వమునకుగాని, మరి ఏబాహ్య అధికారులకుగాని బట్టబయలు చేసేమోయని భయపడవలసిన అగత్యం తనకులేదనీ, రోవన్ భారతప్రభుత్వ హస్తములకు చిక్కి, ఆయుధరహస్య రవాణావిషయం వారికి వెల్లడించినచో అందుమూలంగా తనకు వచ్చే విపత్తు ఏమీలేదనీ, కనుక రోవన్ విషయమై తాను భయపడి హత్యచేయించవలసిన కారణంలేదనీ కూడా అతడు ఉద్ఘాటించెను.

నేడు ప్రాసిక్యూషన్ సాక్ష్యము ముగియుటకు ముందు బీదర్ జిల్లా పోలీసు సూపరింటెండెంటు ఎస్. ఎస్. నాయక్ ఆఖరి సాక్ష్యము నిచ్చెను.

తరువాత డిఫెన్సు తరపువారు కోర్టువారి ముందు "ఈకేసులో నిరూపింపబడవలసిన విషయములు" రెండున్నవి. రోవన్ పోలీసుచర్యాప్పుడు బీదర్‌లో నున్నాడా? అనునది ఒకటి; అతడు హత్యచేయబడినాడా? అనునది ఒకటి. ఈ రెండూ నిరూపితమైనవి. మానికి, రోవన్ హత్యకు పట్టాయింగ్లో ఇచ్చినాడా? అనునది.

కేసు ఏప్రిల్ 23కు వాయిదా వేయబడెను.

## కమ్యూనిస్టు పీడ నిర్మూలన

### ఆత్రాఫ్‌బల్దా జిల్లాలో సైన్యాల ఏర్పాటు

హైదరాబాద్, ఏప్రిల్ 9: ఘట్‌కేసార్, మేడ్చల్ ప్రాంతాలలో కమ్యూనిస్టు ఉపద్రవాన్ని నిర్మూలించటానికి వెయ్యిమంది సైనికులతో కూడిన రెండు దళములు పంపబడినవి. ఘట్‌కేసార్, మేడ్చల్ ప్రాంతాలు హైదరాబాద్‌కు 15, 24 మైళ్ళదూరంలో అత్రాఫ్‌బల్దా జిల్లాలో నున్నవి. నల్లగొండ జిల్లాలోని కమ్యూనిస్టులు అక్కడనుండి పారిపోయి యీ జిల్లాలోకి చేరుకొంటున్నారు.

### చామల సీతారామరెడ్డి అరెస్టు

విజయవాడ, ఏప్రిల్ 8: హైదరాబాద్ సంస్థానంలోని ప్రముఖ కమ్యూనిస్టు చామల సీతారామరెడ్డి అను అతనిని విజయవాడ స్పెషల్ బ్రాంచి పోలీసులు అరెస్టుచేసిరి.

### సంకేశగ్రామంలో అరెస్టులు

మహబూబాబాద్, ఏప్రిల్ 8: కమ్యూనిస్టు ప్రాంతమగు సంకేస గ్రామంలో స్వామిఅనే ప్రముఖ కమ్యూనిస్టు, మరి 10 మంది కమ్యూనిస్టులు అరెస్టు చేయబడిరి. వీరినుండి 16 తుపాకులు, 24 తూటాలు పట్టుబడినవి.

### కాంగ్రెస్ వాలంటీర్ల అరెస్టు

మహబూబాబాద్ ఏప్రిల్ 8: దోపిడీ చేయబడిన ఆస్తి వద్దనున్నదనే కారణంమీద సర్ధపీడు గ్రామానికి చెందిన యిద్దరు కాంగ్రెస్ వాలంటీర్లు అరెస్టు చేయబడిరి.

## నైజాం సైన్యంలో హిందువులకు స్థానం

హైదరాబాద్, ఏప్రిల్ 9: హైదరాబాద్ సైన్యంలో హిందువులను సమీకరించే పనిని తక్షణమే ప్రారంభించుటకు సంస్థాన ప్రభుత్వం నిశ్చయించుకొన్నది. ఈ విషయాన్ని హైదరాబాద్ సైనిక ప్రధానకార్యాలయం నేడు ప్రకటించింది.

సైన్యంలో వివిధ మతవర్గాల ప్రాతినిధ్యాన్ని, సంస్థాన జనాభాలో వివిధ మతవర్గాల నిష్పత్తికితగినట్లుగా పెంచుటే ప్రభుత్వఉద్దేశ్యము. ప్రస్తుతం 500 మంది హిందువులను సంస్థానసేనలోకి సమీకరిస్తూ యీపని ప్రారంభింపబడునని, మిలిటరీ గవర్నర్ మేజర్ జనరల్ చౌదరి క్రితం నెల పత్రికావిలేఖరుల సమావేశములో ప్రకటించెను.

## కోడంత్రికం భరించలేక ఆత్మహత్య

కలకత్తా, ఏప్రిల్ 9: సుశీలాబాల అనే అత్తగారు గౌరి అనే తన కోడలిని ఆత్మహత్య చేసుకోమన్ని ప్రోత్సహించినదనే ఆరోపణపై 18 నెలల కఠిన శిక్ష విధించబడినది. ఆమె కలకత్తా హైకోర్టుకు అప్పీలు చేసి శిక్షను 1000 రూపాయిల జుల్మానాగా మార్పించుకొన్నది.

అత్తగారు కోడలిని అవమానకరంగా తిరస్కారంగా మాట్లాడుచు "ఉరిపెట్టుకు చావరాదూ!" అని రోజూ శాపనార్థాలు పెడుతూ వుండేదనీ, ఒకరోజున నిజంగానే ఉరిపెట్టుకొమ్మనీ, పద్ధతి తెలియక పోతే తాను సహాయంచేస్తానని కోడలితో అన్నదనీ, ఇది భరించలేక కోడలు ఆ రాత్రే ఉరిపెట్టుకుని చనిపోయినదనీ ప్రాసిక్యూషన్‌వారు కేసు పెట్టారు. డిఫెన్సువారు కేసుని ఖండించారు, కాని 24 పరగణాల జిల్లాజడ్జి ఆమెకు 18 నెలల కఠిన శిక్ష విధించాడు. దానిపై ఆమె హైకోర్టుకు అప్పీలు చేయగా ఆమె నేరమును వారు ఖాయపరిచారు. కాని శిక్షను 1000 రూ॥ జుల్మానాగా మార్చి, అది చెల్లించకపోతే ఏడాది కఠిన శిక్షను వేయవలెనని నిర్ణయించారు.

## రాష్ట్రప్రధానులసభ పరిసమాప్తి

న్యూఢిల్లీ, ఏప్రిల్ 9: వివిధరాష్ట్ర ప్రధానులను సంస్థాన ప్రభుత్వ ప్రతినిధులను రావించి ఢిల్లీలో ఉపప్రధాని సర్దార్ వల్లభాయ్‌పటేల్ యేర్పాటుచేసిన సమావేశం నేటితో సమాప్తమైనది. ఈరోజు ఉదయం సమావేశంలో మూడున్నరగంటలసేపు చర్చజరిగినవి." అని భారతప్రభుత్వ సమాచారశాఖా కార్యాలయము ప్రకటించినది.

దేశఅంతరంగిక పరిస్థితులను సమీక్షించుటేగాక, తీర్చతగిన పరిపాలనాసమస్యలను, కేంద్రరాష్ట్ర సంస్థానప్రభుత్వములకు సంబంధించిన అన్ని విషయాన్ని గూడా సమావేశంలో పాల్గొనినవారు చర్చించారు.

గత సంఘటనల దృష్ట్యా దేశ అంతరంగిక భద్రత విషయం చర్చింపబడెను. కమ్యూనిస్టు, ఆర్. యస్. యస్. ఉద్యమములు సమావేశ చర్చలలో ప్రాధాన్యం వహించినవి. రాష్ట్రప్రభుత్వములు, ఆర్. యస్. యస్. కమ్యూనిస్టు చర్యలపట్ల యింకాఅప్రమత్తతతో నుండవలెనని సమావేశంలో నిశ్చయింపబడినది. కమ్యూనిస్టు ఉద్యమానికి అండగా ఉన్న విదేశీయ ప్రాబల్యంపై గూడా చర్చజరిగింది. ఈ విషయంలో సమావేశంలో కొంత ఆందోళన గూడా వ్యక్తమైనది. అయినా వివిధ రాష్ట్ర సంస్థాన ప్రభుత్వములు, యీ విదేశ ప్రాబల్యమును అరికట్ట గల్గుదురని తెలియవచ్చినది.

ఆర్. యస్. యస్. విషయంలో ప్రస్తుత ప్రభుత్వము యేమాత్రమూ మారదు. ఈ విధానంలో యేదైనా మార్పురావాలంటే, అందుకు తగినట్లుగా వ్యవహరించవలసిన బాధ్యత ఆర్. యస్. యస్. నాయకులపై నున్నది.

ప్రభుత్వభవనంలో సర్దార్ వల్లభాయ్ పటేల్ ప్రధానులకు అల్పాహార విందు చేశారు. రాత్రి గవర్నర్ జనరల్ రాజగోపాలాచారిగారు ప్రధానులకు విందు యేర్పాటుచేశారు. ప్రధానులు తమ తమ రాష్ట్రాలకు ఒకటి రెండు రోజులలో తరలిపోగలరు.

## సినిమాల చట్టం

### కేంద్ర శాసనసభ ఆమోదించుట

ఢిల్లీ, ఏప్రిల్ 9: పార్లమెంటు నేడు సినిమాటోగ్రాఫు సవరణబిల్లు ఆమోదించినది. బిడ్డలకు, యువజనులకు చూడరాని ఫిల్ములను నిషేధించు సవరణలోగూడ అంగీకరించబడెను. హెచ్. వి. కామతు గారు, ఈచట్టంయింకా కొంతకాలం వేచియుండి, పరిపూర్ణమయిన మరోచట్టాన్ని చేసియుండవలసిందనిరి.

ప్రచురణశాఖమంత్రి దివాకరు గారు, చట్టమునకు స్థాయిసలహాసంఘం, రాష్ట్రప్రభుత్వములు, ఫిల్మ్‌సంస్థలుగూడ అంగీకారం తెలిపినవని చెప్పిరి. కొద్దిపాటి నిన్నటి సవరణలతో చట్టం అంగీకరించబడెను.

